# తొలి పలుకు

తల్లిదండ్రులను గురించిన ఈ చిన్న పుస్తకము క్రైస్తవ గృహకమిటీ వారి మనవి మేరకు రెవరెండ్ గురుబాచన్‌సింగ్, వారి సతీమణీగారల వలన రచింపబడినది. రచయితలు దీనిని సర్వసామాన్యముగ రచించి, తమ స్వంత యనుభవముల వెలిబుచ్చియున్నారు. ఈ ప్రాముఖ్యమైన విషయము పై చెప్పబడిన యీ సంగతులు సామాన్య వాఙ్మయమునకుండు అవసరతను కొంతమట్టుకు తీర్చునని నేను విశ్వసించుచున్నాను. ప్రతి అధ్యాయమునకు చివరియందుండు ప్రశ్నలు తల్లిదండ్రుల సమావేశములందును, సభ కూటము లందును, పాఠశాలలందును చర్చించుకొనుట కుపయుక్తమైన సంగతులుగ నున్నవి.

ఇట్లు
జాన్ డబ్ల్యు. సాదిక్.
కార్యదర్శి.
క్రైస్తవ గృహకమిటీ.
దేశీయ క్రైస్తవ మహాసభ.

నాగపూరు.
మార్చి 1956.



# కృతజ్ఞత

ఈ పుస్తకమును ఆంధ్ర క్రైస్తవ సభయొక్క క్రైస్తవ గృహ కమిటీ వారి విన్నపము మేరకు ఆంధ్రీకరింపబడెను. ఈ పుస్తకమును అచ్చు వేయుటకు దేశీయ క్రైస్తవ మహాసభ (N.C.C.) వారు దయచేసిన కొంత విరాళమునకుగాను మే మెంతయో కృతజ్ఞులము.

మార్చి, 1956.

ఎ. సి. సి. క్రైస్తవ గృహ కమిటీ.






"దేవుడు తన స్వరూపమందు నరుని సృజించెను; దేవుని స్వరూపమందు వాని సృజించెను; స్త్రీనిగాను, పురుషునిగాను వారిని సృజించెను."

"దేవుడు వారిని ఆశీర్వదించెను; ఎట్లనగా – మీరు ఫలించి, అభివృద్ధిపొంది, విస్తరించి, భూమిని నిండించి దానిని లోబరచుకొనుడి." ఆది, 1: 27, 28 వ

## దేవుని వలన అభిషేకింపబడుట:

పైని చెప్పబడిన వేదభాగము తల్లిదండ్రులయెడల గల దేవుని ఉద్దేశమును వెల్లడిచేయుచున్నది. మానవకోటి కుటుంబములుగ జీవించవలెనని కోరెను. కాబట్టి దేవుడు వారిని స్త్రీ పురుషులనుగ చేసెను. ఇంకను ఆయన వారిని అసమానమైన సంతాన బహుమానముతో ఆశీర్వదించెను. వాస్తవములో ఆయన యీ విధముగ సంతాన క్రమమును భావించి, తల్లిదండ్రులు సంతానాభివృద్ధి చేయుటకు వారికి శక్తి నిచ్చెను. ఫలవంతముగనుండి అభివృద్ధి చేయుట దైవాశీర్వాదమని చెప్పుట సమంజసము. కాబట్టి తల్లిదండ్రులగుట దేవుని నిబంధన లేక నియమము అని చెప్పవచ్చును.

అది ఒక నిబంధనగను, ఆశీర్వాదముగనుకూడ నున్నది. మానవుడు పురాతన స్థితియందనేక అపాయములకులోనై జీవించుచుండిన ప్రాచీన కాలములో అనేకమంది పిల్లలు కలిగియుండుట ఆశింపదగినదిగా నుండెను. ఆ దినములలో కుటుంబములు తెగలుగనుండు ప్రాముఖ్యతను గురించి మనము చదువుచున్నాము. తెగలోని వారందరు ఒకేగృహమందు జీవించుచు యీ తెగయొక్క సామాన్యాభివృద్ధికై ఒకే నాయకుని నడుపుదలక్రింద పనులు

జరుపుకొనుచుండిరి. వారి పరస్పర లాభముకొరకై వారందరు ఏకముగ జీవించిరి. ఈ విధానములో తల్లిదండ్రులు పిల్లలపై ఎక్కువ బాధ్యతను పెట్టిరి, గాయకుడు కూడాను ఈ విధముగ చెప్పుచున్నాడు. "బలాఢ్యుని చేతిలోని బాణము లేలాగున్నవో, యౌవనుని పిల్లలు ఆలాగే నున్నారు." పిల్లలు కలుగకుండుటకు తగినంత కారణముండిన తప్ప, నిస్సందేహముగ తల్లిదండ్రులు పిల్లలను కలిగియుండ వలసినదే. ఒకరి సుఖము కొరకును అనుకూలత కొరకును పిల్లలు కలిగియుండక పోవుట నిజముగా పాపమై యున్నది. పిల్లలులేని యనేకమంది భార్యాభర్తలు సంతోషములేనివారై యుందురు. తఱుచు యట్టి పరిస్థితులు కుటుంబజీవితములో దుఃఖమునకును, తప్పభిప్రాయములకును చిక్కులకును దారితీయును.

## పిల్లలకొరకైన సంరక్షణ, జాగ్రత.

"ఫలవంతముగను, అభివృద్ధికరముగను" ఉండు ఆశీర్వాదము, తల్లిదండ్రులు తమ పిల్లల విషయము తగు జాగ్రతను తీసికొనవలెనను నిబంధన కలిగియున్నారని కూడాను తెలుపుచున్నది. ఒక డనేకమంది పిల్లలను కలిగియుండవలెననునది చాలదు. వారు బలాఢ్యులైన యౌవను లగుటకు, సంఘమునకు భారముగ నుండక జీవితమును నడుపుకొనుటకు చక్కగ సిద్ధపడియుండునట్లు, అతడు వారి విషయమైన జాగ్రతను తీసికొన వలసిన యగత్యత యున్నది. ఈలాటి తగు మంచి జాగ్రతలో శరీర, మానసిక, ఆత్మీయ జాగ్రతయను భావము యిమిడియున్నదని గ్రహించవలెను. పిల్లలకు మంచి యాహారము, తగినన్ని వస్త్రములు, తగిన విద్యయు, వారి ఆత్మీయస్థితి బాగుండుటకు చక్కగ ఆలోచన చేయబడిన విధానమును అవసరమైయున్నది.

కొందరు తల్లిదండ్రులు తమ బాధ్యత విషయము తప్పభిప్రాయము కలిగియున్నారు. బిడ్డ జన్మించినానంతరము వారి జవాబుదారితనము తీరినట్లు భావించెదరు. "దేవుడు మన విషయమైన జాగ్రత తీసికొనియున్నాడు. మన పిల్లల విషయమై కూడ ఆయన జాగ్రత తీసికొనును" అని తల్లిదండ్రులు చెప్పుట మన మెన్ని పర్యాయములో వినియున్నాము. "దేవుడు మనకు పిల్లల ననుగ్రహించియుంచే వారి విషయము జాగ్రత పుచ్చుకొనుటకు ఆయన

తగిన యనుకూలముల కలిగించును" అని కొందరు చెప్పుదురు. ఇది విశ్వాసముగల పనికాదు. ఇవి అనావసరమైనట్టియు, జవాబుదారితనము నుండి తప్పించుకొనునట్టియు సాకులై యున్నవి. వారి పరిస్థితిని బలపరచు కొనుటకుగాను కొందరు తల్లిదండ్రులు యీలాటి అనావసరమైన యభిప్రాయ ములను వెలిబుచ్చుదురు. అట్టి మాటలు తల్లిదండ్రుల యమాయకత్వమును తప్పభిప్రాయమును తెలియజేయుచున్నవి. దేవుడిచ్చిన బహుమతిని కడు జాగ్రతతోను, విచక్షణతోను, ఉపయోగించవలెనను విషయమును వారు మరచిపోవుచున్నారు. పిల్లలు దేవుని అరుదైన బహుమతులైనచో, ఈ ప్రశస్తమైన బహుమతులను తల్లిదండ్రులు అతిజాగ్రతగను, వివేకముగను, పవిత్రముగను వాడుకొనవలెనని, దేవుడు కూడాను ఆశించుచున్నాడు. పల్లె జీవితమునకు సంబంధించిన ఈ సామాన్య సాదృశ్యము చూడండి. వ్యవసాయ దారుడు కష్టపడి పనిచేసి విత్తుటకు తన పొలమును సిద్ధపెట్టును. విత్తుపని ముగించిన తరువాత తన పని ముగిసినట్టు అతడు తలంచడు. ఇంకను చేయ వలసిన పని ఎక్కువగ నున్నదని ఆతనికి తెలియును. కాబట్టి పైరుకు నీరు పెట్టును. తగిన కాలములో కలుపు తీయును. అవసరమైనచో ఎక్కువ ఎరువు వేయును. ఒకవేళ పైరుకు తెవులు వచ్చిన, దానిని నిర్మూలము చేయుటకు తగిన చర్య తీసికొనును. ఈలాగు సామాన్య వ్యవసాయదారుడు కూడాను తనపనిని తెలిసికొని తన పైరును కోసి ధాన్యము ఇంటికి తెచ్చుకొను వరకు కష్టపడి పనిచేయును. ప్రజలు పైరువిషయమై అట్టి జాగ్రతను పుచ్చుకొనిననిశ్చయముగ వారు పిల్లల యభివృద్ధి విషయములో వారిని వారి ప్రారబ్ధాచారమునకు వదలలేరు.

కొందరు తల్లిదండ్రులు బీదవారుగనున్నారు. కాబట్టి పిల్లలకు తగిన విధముగ అనుకూలములు కావించుటకు శక్తిలేనివారై యున్నారు. అయితే తమ దురలవాటులవల్ల తమ కొద్దిపాటి సంపాదనను వ్యయపరచి, పిల్లలు పొందవలసిన మేళ్ళను పొందకుండచేయు తల్లిదండ్రులు గల సందర్భములు కూడ కొన్ని కలవు. ఈలాగుచేయుట పిల్లలయెడలను దేవునియెడలను పాపము చేసినట్లగును.

## ప్రేమానుగమనముల నిచ్చుటకొరకు :

క్రైస్తవ తల్లిదండ్రు లనగా బాధ్యతగల తల్లిదండ్రులని అర్థము. కాబట్టి వారు స్థాపించు గృహము (కుటుంబము) పిల్లల సురక్షిత స్థానముగను తగిన జాగ్రత్త గమనములు పొందతగినదిగ నుండవలెను. మన ప్రభువు యొక్క గృహము అట్టి గృహమునకు మంచి మాదిరియై యున్నది. తల్లి దండ్రులు వారి కుమారుడైన యేసు విషయము నిజమైన గమనము గలవారై యుండిరి. దైవికమైన విషయములు సంభవించినప్పుడు వారు తెలిసికొన గలిగిరి.

"మరియ యీ విషయముల నన్నిటిని తన హృదయమందు దాచు కొనెను" అని వ్రాయబడియున్నది. ఇదంతయు వారు యేసు విషయమై కలిగియుండిన జాగ్రతను తెలుపుచున్నది. దాని ఫలితముగ యేసు విషయము వ్రాయబడినట్లు ".... జ్ఞానమందును, వయస్సునందును దేవుని దయయందును మనుష్యుల దయయందును వర్ధిల్లుచుండెను."

## వారి ఆత్మీయ శ్రేయస్సు కొరకు :

పిల్లల ఆత్మీయ విషయమైన జాగ్రతను వహించవలసిన బాధ్యత ముఖ్యముగ తల్లిదండ్రులదై యున్నది. క్రీస్తు పిల్లలను తన దగ్గరకు రండని ఆహ్వానించడమువల్ల దేవుని దృష్టిలో పిల్లలు విలువగలవారని తెలియపరచు చున్నాడు. వారు చిన్నవారై బలహీనులుగ నుండవచ్చును. అయిననూ వారు విలువగలవారు. పెద్దవారివలె వారు విలువగలవారై సార్థకమైన దేవుని రాజ్య పౌరులని అనిపించుకొనదగు సుశీలత కలిగియున్నారు. "మీరు చిన్న పిల్లలవంటివారుగ నుండకపోతే...." అని క్రీస్తు చెప్పియున్నాడు. పరలోక రాజ్యముయొక్క ఆశీర్వాదములకు పిల్లలు వారసులై యున్నారు. కాబట్టి యూద తల్లిదండ్రులు తమ పిల్లలను ఎనిమిదవ రోజున సున్నతిచేయించుటకై దేవుని ఆలయమునకు తెచ్చుచుండిరి. ఈ ఆచారమువల్ల పిల్లలు దేవుని కుటుంబములోని వారుగ నెన్నబడుచుండిరి. పిల్లలను తన దగ్గరకు చేర్చుకొని వారి నాశీర్వదించినట్లు మనము బైబిలునందు చదువగలము. దేవుని దృష్టిలో చిన్నపిల్లలు ఎంత ప్రాముఖ్యమైనవారైనది యీ విషయములు తేట పరచుచున్నవి. కావున క్రైస్తవ తల్లిదండ్రులు తమ పిల్లలకు శ్రేష్ఠమైన

తర్ఫీతు నిచ్చి సార్థకమైన మాదిరిగ నుండునట్లును, వారి ఆత్మీయాభివృద్ధికి తగిన యేర్పాట్లు చేయుటకు బద్ధులైయున్నారు. తల్లిదండ్రుల బాధ్యతను గురించి పరిశుద్ధుడైన పౌలు యీ విధముగ చెప్పుచున్నాడు. "తండ్రులారా, మీ పిల్లలకు కోపము రేపక ప్రభువుయొక్క శిక్షణలోను, బోధలోను వారిని పెంచుడి." ఎఫె. (6. 4.)

భావికాల జీవితము యొక్క పునాదులు బాల్యదశ ప్రారంభమునకు ముందే వేయబడును. పిల్లలు పుస్తకము నుండి నేర్చుకొను దానికంటే యెక్కువగ తమ గృహములందు తల్లిదండ్రుల నుండి నేర్చుకొందురు. వారు చూచుట ద్వారా నేర్చుకొందురు. వారు ఎల్లప్పుడు తమ తల్లిదండ్రులను చూచుచుందురు. తల్లిదండ్రులు చెప్పునది, వారి జీవిత విధానము, ఒకరియెడల నొకరు ప్రవర్తించు విధము, ఇవియన్నియు తమ యధీనములో నున్న చిన్నపిల్లల జీవితముల పునాదులకు ఇటుకలు సున్నమువంటివిగా నున్నవి.

## క్రమశిక్షణ కొరకు :

తల్లిదండ్రుల బాధ్యతలలో క్రమశిక్షణ మరొక భాగమై యున్నది. కుటుంబములలో పిల్లలను సరియైన క్రమశిక్షణలో నుంచుటకు వేదములు తల్లిదండ్రులను ప్రేరేపించుచున్నవి. క్రైస్తవరీతియైన క్రమశిక్షణ తల్లిదండ్రుల నిరంకుశత్వమునకుగాని, స్వాధీనపరచుకొనుటలోని లోటునకుగాని, చోటివ్వదు. క్రైస్తవ క్రమశిక్షణకు ఆధారము ప్రేమ. పిల్లల భావిజీవితము బాగుండుటకు వారిని ప్రేమించి, వారిని సరియైన క్రమశిక్షణలో నుంచుచున్నాము. జబ్బుతోనున్న తన కుమార్తెతో తల్లి యిట్లు చెప్పినది. "నేను నిన్ను ప్రేమించుచున్నాను. కాబట్టి నేను నిన్ను శిక్షించవలసినది." తరువాత ఆమె వెళ్ళి విలపించినది ; బిడ్డ కూడ విలపించినది. అయితే కొంతసేపు తరువాత వారిద్దరు కలిసికొనినప్పుడు ఆ బిడ్డ తనను క్రమశిక్షణలోనుంచినందుకు తల్లికి వందనము అర్పించినది. క్రీస్తు తల్లిదండ్రుల కొరకు చట్టములను, ఆజ్ఞలను విధించలేదుగాని, తల్లిదండ్రులుగ నుండువారి యొక్కయు, తల్లిదండ్రులు కాబోవువారి యొక్కయు జీవితములను క్రమపర్చుట కొరకే ఆయన సూత్రములను నొక్కి చెప్పియున్నాడు.

ప్రశ్నలు :

1 తల్లిదండ్రుల నియామకము దేవుడు యేర్పాటు చేసిన జవాబుదారితనమై యున్నది. ఈ విషయమును బైబిలు ద్వారా నిరూపించుము.

2 కుటుంబములోని వారందరికి తగినంత ఆహారము, వస్త్రములు, విద్య, ఆత్మీయ విషయము జాగ్రత్త పుచ్చుకొనుట మొదలైనవాటిని సమకూర్చు బాధ్యతను నెరవేర్చుటకు కుటుంబము యొక్క పరిమాణ మేలాగు కారణమగుచున్నది ?

3 పిల్లల పురోభివృద్ధిని అభ్యంతరపరచు తల్లిదండ్రుల కార్యములు, అలవాటులు ఏవి ?



# తల్లిదండ్రులగుటకు సిద్ధపడుట

**పీఠిక :**

తల్లిదండ్రులగుట సిద్ధపడుట యను విషయము హిందూదేశీయు లనేకులకు అసాధారణ విషయముగనున్నది, దానికనేక కారణములున్నవి. హిందూదేశ కుటుంబములలోని కొన్ని ఆచారములు అలవాటులు మొదటి కారణములుగ నున్నవి. భార్యాభర్తలు కూడి తమ జీవిత యేర్పాట్లను గుఱించి తలంచరు. వారి కొరకు కుటుంబములోని తల్లిదండ్రులుగాని, పెద్దలుగాని దాని విషయము యోచించెదరు. భార్యాభర్తలు వారి కొరకు చేయబడిన యేర్పాటును వారొప్పుకొనవలసి యున్నది. ఈలాగున అనేక క్రైస్తవ కుటుంబములలో వాస్తవముగ జరుగుచున్నది — మరియెక్కువగ పల్లె ప్రాంతములందు.

రెండవదిగ, చదువు నేర్చినవారి సంఖ్య చాల తక్కువగ నున్నది. ఈ విషయములతెలుపు వాఙ్మయము వారికి అందుబాటులోలేదు. ఈవిషయమైన సంగతులు పొరుగు వారితో సంభాషించుట ద్వారాను, స్త్రీల నుండి స్త్రీలును

యౌవనుల నుంచె యౌవనులను తెలిసికొందురు. తఱచుగ అలాటి వార్తలు తప్పుగను అపాయకరముగను వుండును; అయితే యౌవన దంపతులకు అంతకంటె మేలైన సంగతులు తెలిసికొనుటకు వీలులేదు.

మూడవదిగ, కుటుంబము ద్వారాగాని, అట్టి సంగతులను వెలిబుచ్చు సంస్థల ద్వారాగాని యౌవన దంపతులు తెలిసికొను అవకాశములేదు. చలన చిత్రములద్వారా యీ విషయములను తెలుపు పటములు హింధూదేశమున చాల తక్కువగ నుండుట వల్లను నూతన దంపతులట్టి వాటిని చూచు అనుకూలములులేవు.

పై జెప్పిన విషయములేకాక మాతాపితృత్వమునకు సిద్ధపడుటకు కొన్ని నిషేధములు కూడ నున్నవి. ఉదాహరణముగ జన్మించబోవు బిడ్డకు ముందుగనే వస్త్రములు తయారుచేసిన బిడ్డకు కీడువాటిల్లునను సామాన్య నమ్మకము గలవారగుటవల్ల అనేకమంది తల్లిదండ్రులు బిడ్డ జన్మించు వరకు వస్త్రములు తయారుచేయరు.

చాలమంది తల్లిదండ్రులు తమ జవాబుదారికత్వమును గుఱించి, తెలియకుండుటకును. జన్మించబోవు బిడ్డ విషయమై సిద్ధపడకుండుటకును కారణములనేకము గలవు. జవాబుదారితనమును తెలిసికొన్నవారు తెలియని వారికి తెలియపర్చవలెను. మరియెక్కువగ ముఖ్యమైన యీ విషయమై ప్రజలకు విజ్ఞానము కలిగించుటకు ప్రతితెగలోను, అప్పుడప్పుడు ప్రచార పర్యటన చేయవలెను. తల్లిదండ్రులు కాబోవు వారు తెలిసికొనవలసిన విషయముల గుఱించి విచారింతము.

## మానసిక, ఆత్మీయ సంసిద్ధత :

మానసిక, ఆత్మీయ సంసిద్ధత ప్రకృతియందలి ముఖ్యమైన భాగమై యున్నది. బిడ్డ జన్మించగానే కుటుంబములోని సంఖ్య రెండు నుండి మూడుకు పెరుగును. బిడ్డ పుట్టుటకు పూర్వము వారిద్దరే యనుభవించు చుండినది యిప్పుడు బిడ్డతో కూడ పాలుపొందవలసిన యవసరత ఏర్పడును. ఇప్పుడు తల్లిదండ్రులు కొంత త్యాగము చేయవలసివచ్చును. క్రొత్తగ జన్మించిన బిడ్డ విషయము వారు జాగ్రత్త పుచ్చుకొనుటలో కొన్ని యిబ్బందులను అనుభవించుటకు సంసిద్ధులుగ నుండవలెను. బిడ్డ యుక్త

వయస్సుకు వచ్చువరకు తల్లిదండ్రులైనవారు ఎక్కువ బాధ్యతను వహింప సిద్ధముగ నుండవలసియున్నది. క్లుప్తముగ జెప్పిన తల్లిదండ్రులు కాబోవు వారు మానసికముగ బిడ్డ రాకకొరకు సిద్ధపడియుండి సంతోషముతో యీ బిడ్డను స్వీకరింపవలసి యున్నది. ఇట్లుండుటవల్ల బిడ్డకు అన్ని విధముల శ్రేష్ఠమైనవాటి నిచ్చుటకు అనుకూలపడును. బిడ్డ కుటుంబమునకు భారముగ నుండక ఆశీర్వాదకరముగ నుండును.

తల్లిదండ్రులగుటకు సిద్ధపడుటలో ఆత్మీయముగ సిద్ధపడుట ముఖ్య విషయమై యున్నది, ప్రపంచములోనికి బిడ్డ వచ్చుటకు తల్లిదండ్రులు బాధ్యులుగ నున్నారు, దేవుని బిడ్డయగుటకు అవసరమైన శక్తులను కలిగిన, నూతన జీవితముగ నుండును. బిడ్డయందలి శ్రేష్ఠమైన దానిని కనుగొని యభివృద్ధిపరచుటకు బిడ్డకు సహాయము చేయవలసిన బాధ్యత తల్లిదండ్రులదై యున్నది. దేవుని భయమందును సజీవమైన దేవునితోటి బంధుత్వమును కలిగియుండునట్లు తమ పిల్లలను నడిపించు భారము తల్లిదండ్రులదైయుండ వలెను. పిల్లలకొరకు తల్లిదండ్రులు ప్రవేశపెట్టు శ్రేష్ఠమైన మాదిరీలను తెలిసియైనను, తెలియకనైనను తమ జీవితములలో అధికముజేసి కొనునట్లు చేయవలెను. ఆ విధముగ తమ పిల్లల యవసరముల ప్రకారము తగిన ఉదాహరణముల వారికి చూపించుటకును, వాటికి సార్థకమైన విధముగ వారుండుటకును సిద్ధపెట్టు బాధ్యతను తల్లిదండ్రులు కలిగియుండవలెను.

## ప్రకృతి సంబంధ సంసిద్ధత :

గర్భ సూచన కనబడిన వెంటనే యౌవన దంపతులు వైద్యుని సలహా కొరకు వెళ్ళవలసిన మొదటి పనియైయున్నది. కాబోవు తల్లి వైద్యుని దగ్గర పరీక్ష చేయించుకొని, తగిన సలహాలను వైద్యునినుండి గైకొనవలెను. వైద్యుని దగ్గరకు వెళ్లుటకు యెవరుగాని సిగ్గుపడ నవసరములేదు. ప్రారంభ మున నెలకొక్కసారి వైద్యుని చూడవచ్చును. అయితే ప్రసవముకాలము సమీపించుకొలది తరచుగ వైద్యునితో పరీక్ష చేయించుకొనుచుండ వలెను. గర్భవతి తన ఆరోగ్యము చక్కగా లేదనుకొనిన, అనగా క్రింది కడుపులో నొప్పిగాని, బహిష్టు పోవుటగాని లేక అసాధారణమైన బద్ధకముగాని, వుండిన ఆమె పడకలోనేయుండి వైద్యుని సలహా పొందవలెను, గర్భముతోనుండు కాలములో యీలాటి హెచ్చరిక గుర్తుల నలక్ష్యము చేయకూడదు.

గర్భముతో నుండిన కాలమందు బహుశా కొన్ని అనానుకూలములు, గుండెలోమంట, మలబద్ధకము వుండవచ్చును; కొన్ని సమీప కాలములో ఊపిరి చక్కగ ఆడకుండుట, ముద్దవాయువు మొదలగు లక్షణములు కనబడ వచ్చును, కొందరికి యీ లక్షణములు యెక్కువగ కనబడును. మఱి కొందరికి యీ లక్షణములు బొత్తిగ కనబడక పోవచ్చును.

## సంతోషకరమైన వాతావరణము:

గర్భముతోనున్నకాలములో స్త్రీ తన విషయము యెక్కువ జాగ్రత పుచ్చుకొనవలెను. ఆమె కోపపడుట లేక కోపమును కలిగించు విషయముల వర్జించుచు, సంతోషముగను, చిరునవ్వు కలదిగ నుండవలెను. ఈ చెడ్డ భావములు తల్లికిని, బిడ్డకును కూడ కీడుకరముగనుండును. ఆమె భయంకర దృశ్యములు చూచుట వర్జించవలెను. హిందూదేశములో వీటిని ఎక్కువగ పాటించు కొన్ని కుటుంబములున్నవి. సాధ్యమైనంతవరకు గర్భిణీ స్త్రీలను యట్టి దృశ్యములను చూడనివ్వరు. ఈకారణములనుబట్టియే కాబోలు తల్లి యొక్క మేలుకొరకనేక కుటుంబములలో యౌవన తల్లులు మొదటి ప్రసవ మునకుగాను తమ తల్లిదండ్రుల గృహములకు వెళ్ళుదురు. అన్నికుటుంబము లందు యీలాగు జరుగుటకు సాధ్యపడకపోవచ్చును. అయితే గర్భవతులు వారెక్కడ నుండినను తగు జాగ్రత తీసికొనవచ్చును.

## ఆహారము — క్రీడ:

తల్లి తన ఆహారము, విశ్రాంతి, క్రీడ మొదలైన విషయములందు గమనము కలిగియుండవలెను. తల్లి తనను తన బిడ్డను కూడ పోషించు కొనవలసియున్నది. కాబట్టి బలమునిచ్చునట్టి పరిమితియైన యాహారమును పుచ్చుకొనుట యవసరము. తల్లులకు ఎక్కువ క్రొవ్వుపదార్థములుగల ఆహార మవసరములేదు. ఇది వారి జీర్ణశక్తికిని, విరేచనమునకును, ఆటంక కారణముగ నుండును. సులభముగ జీర్ణమగునట్టి పుష్టికరమైన భోజనము పరిమితి ప్రకారము వారికి యవసరమై యున్నది. కాబట్టి పాలు, పండ్లు, కూరగాయలు, ముఖ్యముగ ఆకుకూరలు, యెక్కువగ నుపయోగించుట యుక్తము. మద్రాసు ఉమన్స్ క్రిష్టియన్ కాలేజీలోనున్న శ్రీమతి ఫిలిప్స్ అమ్మగారు పుష్టికరమైన ఆహారముపై తమ ఉపన్యాసములో భాజి యనబడు

ఆకుకూర బంగారువంటిదని చెప్పియున్నారు. ఆమె ఒక బంగారుముక్కను కలిగియుండుటకంటె భాజీని కలిగియుండుట శ్రేష్ఠమని చెప్పియున్నారు. భాజీలోని పుష్టిగల పదార్థముయొక్క విలువను కనుగొన్న ప్రతియొక్కరు ఆలాగు చేయుదురు.

తల్లికి తనయొక్కయు, తన బిడ్డయొక్కయు, దేహమును బలపరచు కొనుటకే విధముగ పరిమితిగల బలమైన భోజనమవసరమో, ఆలాగే తన్ను తాను సరియైన స్థితిలో నుంచుకొనుటకు పనికలిగియుండుట యవసరము. గర్భధారిణిగ నున్నప్పుడు మరిముఖ్యముగ ప్రసవమప్పుడు సహాయకరముగ నుండుటకు యిట్టి యలవాటు మంచిది. పల్లెప్రాంతములందలి స్త్రీలు పనులు కలిగియుండి వెలుపట గాలిలో ఎక్కువ కాలము గడుపుచుండుటవల్ల వారికి సులువైన ప్రసవములు జరుగుచుండుట తఱచుగా గమనించబడుచున్నది.

## ప్రసవ కాలము :

ఆస్పత్రులందుగాక తఱచుగ గృహములందే ప్రసవములగుటకు ప్రజలు కోరెదరు. తమ కుటుంబములోనున్న వృద్ధురాలి సహాయముననో, పొరుగింటివారి సహాయముననో, లేక వారి సమీపములోనుండు మొరటు మంత్రసాని సహాయముననో, చూచుకొనవచ్చునని తలంచెదరు. కష్ట పరిస్థితి ఏర్పడకపోతే యీ సహాయములు అనుకూలపడును. కష్టపరిస్థితి ఏర్పడినట్టయిన అట్టి సహాయములు పనికిరాకపోవును. మఱియు ఆస్పత్రికి పోవుటకు చాల ఆలస్యమై పోవును. తఱచు యనేక సందర్భములలో ఆపాయకర పరిస్థితి యేర్పడి విలువగల ప్రాణమునకే ముప్పు కలుగును. హిందూదేశములో అనేకమంది తల్లులు ప్రసవకాలమందు మరణించెదరని బాగుగా తెలిసిన సంగతే. ప్రతిసంవత్సరము మరణ శాతము 20 % నుండి 30 % వరకుండును.

వైద్య సహాయము దొరకని స్థలములలో అట్టి సహాయములు తీసుకొన వలసినదే. అయితే ఆస్పత్రిగల స్థలములలో తల్లిని ప్రసవమునకు ఆస్పత్రికి పంపవలెను. స్త్రీ యొక్క ప్రసవములు ఎక్కువగుటవల్ల ఆస్పత్రికి పంప వలసినయవసరత ఎక్కువగుచున్నది. నాలుగవ ప్రసవమునకు తరువాత వచ్చు ప్రతి ప్రసవమందును, అపాయముండునని చెప్పబడు చున్నది.

ఎక్కువ ప్రసవములైన స్త్రీలు మంచి ఆరోగ్యవంతులుగ నుండుట కూడ చూడవచ్చును. పంతొమ్మిదిమంది పిల్లలను కనిన తల్లి తనకుగాని పిల్లలకు గాని ఎలాటి యపాయములేక సుఖముగనుండుట కూడ చూడగలము. అయితే అట్టి ఉదాహరణములు అరుదుగనున్నవి. ఎక్కువమంది తల్లి దండ్రులు అట్టి ఉదాహరణములతో పోటీచేయజాలరు. బిడ్డ జన్మించుట యనగా తల్లి రెండవసారి జన్మించినట్టే యను సామెత యున్నది. కాబట్టి తగిన జాగ్రత పుచ్చుకొను అనుకూలతయుంతు ఆస్పత్రికి ప్రసవమునకు స్త్రీని పంపవలసిన విధియైయున్నది.

## ఆర్థిక సంసిద్ధత :

సిద్ధపడుటలోనుండు మరొక విషయము ఆర్థికముగ సిద్ధపడుటయై యున్నది. కొందరు వివాహమునకై అప్పుతీసుకొని, దానిని చెల్లించక పూర్వమే సంతానవంతులగుదురు. ప్రసవ సందర్భములోయగు ఖర్చులకు గాను మరొక అప్పు చేయుదురు. ఈ బాకీలు భావికాలమందు యౌవన దంపతుల కొరకు తిరుగటిరాయిగానుండి వారి సంతోషమును, ఉత్సాహమును చంపివేయును. అట్టి అప్పులు వర్జింపబడవలెను. దానికి బదులు తల్లి దండ్రులు మితవ్యయ లక్షణముల నభివృద్ధిచేసి, యీ విశేష సమయములకు యవసరమైన డబ్బును సమకూర్చవలెను. ఇది తల్లిదండ్రులందరి జీవితములో ప్రాముఖ్యమైనది. కట్టకడకు వివాహము ఒక యవసరతయనిగాని, అనుకొనని విధముగ సంభవించునది యనిగాని కాదు. వివాహమునకు పూర్వము ప్రతి ఒక్కరు కొంత సిద్ధపడవలసియున్నది. ఆలాగే వివాహ మాడిన దంపతులకు ఒక దినమున బిడ్డలు కలుగుదురని తెలియును. కావున ఆర్థికముగవారు సిద్ధముగ నుండవలయును.

బిడ్డ జన్మించినప్పుడు అనావసరమైన ఖర్చులుగల కొన్ని ఆచారములు గలవు. గొప్ప విందును యేర్పాటుచేయు ఆచారము వాటిలో నొకటియై యున్నది. మరి విశేషముగ మగబిడ్డ పుట్టినప్పుడు, కుటుంబములో బిడ్డ పుట్టినప్పుడు మనమందరము సంతోషముగ ఆచరించవలెనని కోరుదుము. అయితే యట్టి విందునుచేసి సంతోషపడుటకు అప్పులపాలైన యెడల అందులో ఏమి విలువయున్నది ? సంపదగల తల్లిదండ్రులు అట్టి విందులు

చేయుటకు శక్తిపరులుగ నుండగలరు. అయితే కొద్దిరాబడి గలవారు అట్టి ఖర్చులు చేయుటకు ముందు చక్కగ ఆలోచించుకొనవలెను. వాస్తవములో వారు ఖర్చును క్లుప్తపరచుకొను సదుపాయముల చూడవలెను. లేక కొద్ది మందికి మాత్రమే విందు యేర్పాటుచేయుట యుక్తమైనదిగ నుండును. భావిజీవిత యాత్రలో దుఃఖమును కలిగించు ఆచారముల ననుసరింపకూడదు.

బిడ్డ విషయమైన జాగ్రత :

యౌవనతల్లి తన బిడ్డవిషయము జాగ్రత తీసికొనుటకు సిద్ధపడియుండ వలెను. బిడ్డకు స్నానము చేయించుట, ఉడుపులు తొడిగించుట మొదలగు పనులు యేలాగుచేయవలసినది తెలిసికొని యుండవలయును. బిడ్డకవసరమైన సాధారణ ఉడుపులు కుట్టుటకు ఆమె తెలిసికొని యుండవలెను. పిల్లలకు వచ్చు జబ్బుల విషయమైన కొద్దిపాటి జ్ఞానము కలిగియుండుట ఆమెకు మేలు కరముగ నుండును. బిడ్డయందు జబ్బులక్షణములు కనబడినప్పుడు ఆమె యా బిడ్డ విషయము తగు జాగ్రత తీసికొనుటకు యీ జ్ఞానము ఆమె ప్రయాసమును తగ్గించును.

తల్లి తన బిడ్డను శుభ్రముగ నుంచుటలో ఎక్కువ శ్రద్ధకలిగియుండ వలెను, అనేకమంది తల్లులు తమ అజ్ఞానమువల్లనో లేక వారి యశుభ్రమైన జీవితమువల్లనో తమ బిడ్డల శుభ్రత విషయములో జాగ్రతగ నుండరు. చిన్నపిల్లలు శుభ్రిముగ నుండకపోయినప్పుడు అన్నివిధములైన జబ్బులకు లోనగుదురు. వారు అతిసులభముగ చర్మవ్యాధులకు కంటి జబ్బులకు, కడుపు జబ్బులకు గురియగుదురు. తల్లులు తాము శుభ్రముగ నుండుటకును. తమ బిడ్డలను శుభ్రముగ నుంచుటకు నేర్చుకొనవలెను.

బిడ్డ జన్మించక పూర్వమే కొన్ని ఉడుపులను తయారుగ పెట్టియుండ వలెను. మగబిడ్డయైనను, ఆడబిడ్డయైనను శిశుదశలో పిల్లలందరు ఒకేవిధ మైన ఉడుపులు ధరించవచ్చును. కొంతకాల మా విధముగ చేయవచ్చును. తల్లిదండ్రులు బిడ్డకొరకు చిన్నపరుపును తయారుచేయవలయును. యౌవన దంపతులు తమ కుటుంబములలోకాక వేరు స్థలములలో వాసము చేయు నప్పుడును, వారికి మొదటి బిడ్డగా నుండునప్పుడును యీలాగు సిద్ధపడుట మరీంత యవసరము. వారికితర సహాయములుండవు. కాబట్టి పుట్టబోవు తమ బిడ్డకు తామే తగురీతిగా సిద్ధపడవలెను.

## భర్త యొక్క జవాబుదారితనము :

తల్లిదండ్రులగుటకు సిద్ధపడుటలో భర్త యొక్క బాధ్యత యెట్టిదని యింతవరకు ప్రస్తావించలేదు. దానినిబట్టి యితనికి జవాబుదారితనము లేదని భావించకూడదు. ఇంతవరకు వివరించిన విషయములన్నిటిలోను వాస్తవముగ అతడు భాగస్తుడై యున్నాడు. ఏలాగైనను, కొద్ది విషయములు చెప్పవలసి యున్నది. భార్య గర్భవతిగా నున్నదని తెలిసిన వెంటనే భర్త ఆమెను ఒక మంచి వైద్యుని దగ్గరకు తీసికొని పోవలెను. ఆమెతో కూడ అతడు వెళ్ళుట యెక్కువ సహాయకరముగ నుండును. మఱి విశేషముగ ఆమె సిగ్గుపడునదిగాను, వైద్యుని దగ్గర వెళ్ళుటకు వెనుదీయునదిగానుండిన యెడల ఆయన సహాయకారిగా నుండును. గర్భవతిగానుండు కాలమందు ఆమెకు వచ్చు వాంతుల విషయములోను, దానికి సంబంధించిన యితర బాధలలోను, భర్త ఆమెకు ఆదరణగ నుండి గృహకృత్యముల భారము నుండి ఆమెను తప్పించవలెను. ఈ కాలమునందే భార్యకు విశ్రాంతి అవసరమై యున్నది. మఱియు ఆమె అలసట కలిగించు పనులను వర్జింపవలెను. ఆమె నిరాశ చెందిన సూచన కనబడినప్పుడు అత డామెను సంతోషపెట్టవలెను. అత్త పోరుండు కుటుంబములలో భార్య యెడల భర్త యెక్కువ ఆదరణ చూపెట్ట వలసియున్నది.

బిడ్డ జననము కొరకు వారిద్దరును కలిసి యేర్పాటు చేసికొనుట యుక్తము. ప్రసవమునకు భార్య యే ఆస్పత్రికి వెళ్ళవలసినది, లేక ఆస్పత్రికి వెళ్ళుటకు వీలులేనిపరిస్థితిలో వారింకేదైనా ఏర్పాటు చేసికొనుటకు తీర్మానించు కొనవచ్చును. ప్రసవకాలమప్పుడు ఏ తొందరయులేక తమ ఏర్పాటుప్రకారము బాగుగ జరిగిపోవునట్లు అట్టి విషయములన్నిటియందు జాగ్రత్తవహించవలెను. బిడ్డయొక్క ఉడుపులు, ఆహారము మొదలగు అవసరమైన వాటికొరకు ఇద్దరు కలిసి యేర్పాటు చేయవలెను. ఆలాగు వారిద్దరు కలిసి పనిచేయవలెను. బిడ్డ జన్మించినంతనే భర్త కర్తవ్యము ముగిసిపోదు. కొన్ని విధాల యీ బాధ్యత అధికమగును. నవమాసములు బిడ్డను మోసిన తల్లి కిప్పుడు విశ్రాంతి యవసరము. స్వల్పసహాయములుగ యవి కనబడినను తండ్రి యనేక విధముల సహాయపడవలెను; ఆమె కొద్దిసేపు నిద్రించుచున్నప్పుడు గాని, షికారు వెళ్లినప్పుడు బిడ్డను మోయుటగాని, తల్లి పనిబాటలు చూచు

కొనునప్పుడు బిడ్డకు ఆహారము తినిపించుటయందుగాని, తండ్రి సహాయపడ వచ్చును. అట్టి విధానములవల్ల తల్లికి పనిభారము చాల తగ్గిపోయి తల్లి దండ్రులమధ్య మంచి పరస్పర సంబంధము లేర్పడును.

బిడ్డ నవమాసములు గర్భములో నుండిన తరువాత జన్మించుట ద్వారా తల్లియందు శారీరక మార్పులు కలుగుచున్నవి. తండ్రి యీ మార్పులను గణించక, తమ బాంధవ్య జీవితమును క్రమపరుచుకొనుటలో అతని భార్యతో సహకరించక పోయిన పక్షమున తల్లికి అనానుకూలమును అపాయమును కలిగించవచ్చును. కాబట్టియే గర్భవతిగానుండు కాలమందును బిడ్డ పుట్టిన ఆరు వారముల వరకును భార్యా భర్తల సంభోగ విషయమును గురించి ఖండితమైన క్రమము నవలంబించవలెనని వైద్యులు హెచ్చరించెదరు. వీటన్నిటికిని తండ్రి సంతోషముగ సిద్ధపడియుండవలెను.

ప్రశ్నలు :

1. క్రొత్తబిడ్డకు ప్రాముఖ్యముగ అవసరమైన వస్తువులేవి? వాటిని తక్కువ ఖర్చుతో గృహమునందేలాగు తయారుచేయవలయును?
2. బిడ్డ జన్మించు విషయములోను, క్రొత్త బిడ్డ విషయములోను, మీ ప్రాంత మందలి మూఢ విశ్వాసములేవి? ఇవి యేలాగు పుట్టినవి? వాటి బంధకములనుండి నీవు జనులను యే విధముగ విడుదల చేయగలవు?
3. తల్లులు అప్పుడప్పుడు పరీక్ష చేయించుకొనుటకును, ప్రసవమునకు వైద్యుని సలహా కొరకు వెళ్లునట్లు నీ వెట్లు ప్రోత్సహించగలవు?
4. తల్లిదండ్రులగుటకు సిద్ధపడుటలో కుటుంబ ప్రార్థనల ప్రాముఖ్యత ఏమి?



# కుటుంబములో క్రమశిక్ష

బిడ్డ పుట్టినది మొదలుకొని, క్రమశిక్ష సమస్య ప్రారంభమగును. చిన్నబిడ్డ మాటలాడలేకపోయినను, ఆమోదించకపోవడము, తిరస్కరించడము కోపపడుట, అవసరమైనవి కావలెనని తెలుపగల మార్గము తెలిసినదిగ నుండును. కావున తల్లి బిడ్డను నిద్రపుచ్చుటకుగాని, నిమ్మళపరచుటకుగాని, ప్రయత్నించినప్పుడు బిడ్డ యేడ్చును. బిడ్డ యిట్లు చేయుట తల్లి యొక్క విశ్రాంతికి భంగకరముగ నుండి బిడ్డ తనకు చీకాకు కలిగించునదిగా నున్నట్టు ఆమె తలంచును. అలాగున క్రమశిక్ష సమస్య ప్రారంభమగును.

క్రిమశిక్ష సమస్య ప్రపంచమంతట సామాన్యమైనది :

క్రమశిక్ష సమస్య కొన్ని కుటుంబములకే వుండుటలేదు. అది తల్లిదండ్రులందరు ఎదుర్కొనవలసిన సమస్యయై యున్నది. కాబట్టి తల్లిదండ్రులు కుటుంబ క్రమశిక్ష విషయములో కోపపడుచుందురు. అట్టి యవస్థలో నుండునది వారేకాదనియు, వారివలెనే అనుభవించు వారనేకులున్నారని గ్రహించవలెను.

బిడ్డల సంఖ్య అధికమగుకొలది చిన్నవారు పెద్దవారుగను, యౌవనులుగను, పెరుగుకొలది క్రమశిక్ష సమస్య కూడ అధికమగుచు క్లిష్టపరిస్థితి కూడ యేర్పడును. అలవాటులలో ఒక బిడ్డకును యింకొక బిడ్డకును వ్యత్యాసముండును. ఒక బిడ్డ ఒక విధముగ ప్రతిక్రియ చేయవచ్చును. అదే పరిస్థితిలో యింకొక బిడ్డ మరొక విధమున ప్రతిక్రియ చేయవచ్చును. ఇది క్రమశిక్ష సమస్యను మరింత క్లిష్టపరిస్థితికి తెచ్చును. కొందరు తల్లిదండ్రులు కుటుంబములో క్రమశిక్ష సమస్య విషయములో కొన్ని చట్టముల నేర్పాటు చేయుదురు. అయితే అట్టి చట్టములు అందరకు ఒకే విధముగ అన్వయించవు.

ప్రాచీన క్రమశిక్ష—ప్రాచీన పరిహారము :

కుటుంబములో కఠినమైన క్రమశిక్షను ప్రవేశపెట్టుటవల్ల పిల్లలను యౌవనులను తులువతనమునుండి దూరపరచునని ప్రపంచమందలి తల్లిదండ్రు

లందరు విశ్వసించిన కాలముండెను. కాబట్టియే అనేకమంది తల్లిదండ్రులు పిల్లల విషయము చాల క్రూరలక్షణములు కలిగియుండిరి. బిడ్డ తప్పిపోయిన యెడల అది తల్లిదండ్రుల బలహీనతయని భావింపబడుచుండెను. అందు వల్లనే "శిక్షలేమిడివల్ల బిడ్డ చెడును" అను సామెత యున్నది.

పరిశోధనలవల్లను, ఆలోచనలిచ్చు కేంద్రములవల్లను ఇప్పుడు బిడ్డ మానసిక శాస్త్రమభివృద్ధి గాంచినందున క్రమశిక్ష సమస్య యెంత కష్టమైన దనియు అది కఠినమైన క్రమశిక్షద్వారా చక్కపెట్టబడునది కాదనియు జనులు గ్రహించుటకు ప్రారంభించియున్నారు. వాన గాలికి ముందు వాతావరణ మేలాగు నెమ్మదిగ నుండునో ఆలాగే దండ ప్రయోగమువల్ల తాత్కాలికముగ పరిస్థితి నెమ్మదింపవచ్చును. క్రమశిక్ష తగ్గుకాలది చిన్న పిల్లలు క్రమశిక్ష విషయములో ప్రతి క్రియచూపి తఱచుగా తప్పిపోదురు. పిల్లలు తప్పిపోయినప్పుడు వారిని అర్థము చేసికొనుటకు తల్లిదండ్రులందరు తెలిసికొని జ్ఞాపకముంచుకొనవలసిన విషయములు కొన్ని గలవు.

## పిల్లలను అర్థము చేసికొనుట :

పిల్లలా విధముగ యెందుకు ప్రవర్తించెదరను విషయములను తల్లిదండ్రులు గ్రహించుకొనుటకు ప్రయత్నించెదరు. బిడ్డ తప్పు విధముగను నీచముగను, అశుభ్రముగను, మొండిగను వున్నయెడల బిడ్డ నాలాగు ప్రవర్తించునట్లు చేయునదేది యని ప్రశ్నించుకొనవలెను. పిల్లల విషమైన ప్రమాణ తీర్మానమును తల్లిదండ్రులలో భేదపడుచున్నట్లు కనబడుచున్నది. ఏది తల్లిదండ్రులకు చెడ్డగను, తప్పుగను, నీచముగను కనబడునో అది పిల్లలకు అలాగున కనబడదు. మీ పిల్లలు దిండ్లతో ఆడుకొనుట, లేక పెద్దపిల్లలు తమ తమ్ములను చెల్లెండ్రను తొందరచేయుట లేక యింటిలోని సామానుల దగ్గర చెండు ఆడుకొనుట చూచియుండలేదా ? బిడ్డకు చెంప దెబ్బలు వేయవచ్చును. లేదా చీకొట్టవచ్చును. అయితే అది ప్రయోజనము లేక పోవచ్చును. నీవలెకాక బిడ్డ వేరువిధముగ తలంచును. కాబట్టి తా నెందుకు శిక్షింపబడువది, గ్రహించుకొనదు. నీ చెంప దెబ్బలు, చీవాట్లు లేక ఆదిరింపులు అతనిని నీచముగ చేయడమేకాక మఱింత కోపము

ఈలాగున సంభవించును : తల్లిదండ్రులు తప్పని భావించు దానిని బిడ్డ చేయును. తల్లిదండ్రులు దానిని చేయుట మానుకొనుమని కోరుదురుగాని అతడు వినడు. తమ బిడ్డ చెడ్డవాడుగనున్నాడనియు, అతడు దెంపదెబ్బలు తినుటకు తగినవాడని వారు తలంచెదరు. అలాగు బిడ్డ దానిననుభవించును. దెంపదెబ్బలు తినినప్పుడంతయు మఱింత కోపపడునట్లగపడును. అతడు తన తల్లిదండ్రులతో తర్కించలేక మనస్సునందు దుఃఖపడును. దీని ఫలితమేమనగా ఆతడు తన కోపస్వభావమును తనలో దాచియుంచుకొనును.

బిడ్డనీచముగ తలంచుకొని అట్టి స్వభావమునే మనస్సునందు నిలువ చేసుకొని, పదేపదే నీచముగ ప్రవర్తించును. ఇది తల్లిదండ్రులను గందరగోళపరచును. ఆతనిని శిక్షించుధీమాయను మనస్సున కలవారై ఆలాగే చేయవచ్చు. ఈలాటి విధానము తల్లిదండ్రులకుగాని పిల్లలకుగాని సహాయకరముగ నుండదు. పిల్లలు తమ చెడ్డమనస్సును ఎట్లు మార్చుకొనవలసినది వారికి చూపెట్టవలసినపని, తల్లిదండ్రులపై నున్నది.

వేరొక మార్గము చూపుము :

ఒక బాలిక తన యింటిలోని నేలపై రంగులు పూయుచు చెడగొట్టుచుండెను. తండ్రి ఆమెను ఆలాగుచేయవద్దని మందలించెను గాని ఆతని మాటలను బిడ్డ వినలేదు. వాస్తవముగ ఆ బిడ్డ ఆయన యెడల అగౌరవము చూపినది. కడకు తండ్రి ఒక పటమును ఆ బిడ్డ కిచ్చి దానికి రంగులు వేయుమనెను. ఆ బిడ్డ పటమును గీయుచు, రంగులు వేయుటయందే తనగమనము నుంచుట ద్వారా నేలను అశుభ్రపరచు విషయమును మఱచిపోయెను. బిడ్డలు తప్పు ప్రవర్తన కలిగి యుండకుండుటకు వారికి వేరొక మార్గము అవసరము. బిడ్డ తాను నీచమైనట్టియు, తుంటరి యైనట్టియు, మొండితనము గలవాడుగను, నున్నానను విషయమును గ్రహించుకొనడు. తల్లిదండ్రులు బిడ్డ చెడ్డదని తలంచుచుంటే బిడ్డ తన ఆలోచనకొద్ది తన ప్రవర్తన సామాన్యమైనదిగ నెంచుకొని ఆలాగు ప్రవర్తించును, అట్టి సందర్భములందు తల్లిదండ్రులు యుక్తిగ ప్రవర్తించి, ఎక్కువగ గ్రహించుకొనునట్లు చేయవలెను. తన ఉద్దేశము నెరవేర్చుకొనుటకు వేరొకమార్గము ఉన్నట్టు బిడ్డకు తెలియదు కాబట్టి తన మార్గమునందే ప్రవర్తించుటకు పట్టుదల కలిగియుండును. చాల చెడ్డవాడుగను నీచముగను ప్రవర్తించు

ఎవరేమి చెప్పినను, లక్ష్యపెట్టని బాలు డొకడు నాకు తెలియును. నీ తల్లిని కొట్టునంత మనస్సు నీకు కలుగునా యని తండ్రి యతనిని అడిగెను. ఇది విన్నప్పుడు బాలునికి ఆశ్చర్యము కలిగి తక్షణమే నిమ్మళపడి తన స్వభావము మార్చుకొనెను. తల్లిదండ్రుల కతదెంత అమర్యాదగను. నీచముగ నుండినది తాను గ్రహించుకొనలేని పరిస్థితిలో నుండెను. కాబట్టి పిల్లలు తమ ఉద్దేశములను వెలిబుచ్చుటకు వారికి వేరొక మంచి మార్గమును చూపండి.

తల్లిదండ్రుల ప్రేమ, గమనములు పిల్లలకు కొఱతపడి యుండుటయే కుటుంబములో క్రమశిక్ష లేకపోవుటకు మరొక కారణము. ఇది వారిని ఉద్రేకించినట్లు చేయును. అనేకమంది తల్లిదండ్రులు పనిబాటలలో మునిగి యుండుట మనకు తెలియును. వారు ఉదయము నుండి రాత్రివరకు కష్టపడి పనిచేయుదురు. తండ్రి పొలమునకుగాని, పనులుచేయు స్థలములకుగాని కర్మాగారములకుగాని ఆఫీసులకుగాని వెళ్లుదురు. కాబట్టి పిల్లలతో తమాషా లాడుటకును, వారి సహవాసములో కాలము గడుపుటకునుగాని వారి కనుకూల ముండదు, సేవకుడు లేని కారణమున గృహమునందు తల్లి తానే వంట చేయుట, ఇంటిని శుభ్రపరచుకొనుట మొదలగు పనులను సాగించుచు పెద్ద కుటుంబ విషయమైన జాగ్రత తీసికొనుచుండును గనుక ఆమె ప్రతి బిడ్డ విషయము గమనము కలిగియుండుట కసాధ్యము. దాని ఫలిత మేమనగా పిల్లలు తమ తల్లిదండ్రుల యొక్క ప్రేమ కొఱకును, వారి గమనము కొఱకును ఆశించియుందురు. వారి కది లభించనప్పుడు వారికి నొప్పి కలిగి వాటికి బదులు యితరమేమైన పేదుకుచుందురు. ఇతరమైనవాటి కొఱకు వెదుకుట కంత తగినదికాదు. కుటుంబములో క్రమశిక్ష సమస్య తగినరీతిగా పరిష్కరించనిచో పిల్లలు పెద్దవయస్కులై తల్లిదండ్రులకు ఎదురుత్తరము లిచ్చు కాలము వచ్చును. తల్లిదండ్రుల క్రియలను విమర్శించుచు వారు మొండి లక్షణములు గలవారగుదురు. అట్టి క్రమశిక్ష సమస్యను జయించు టకు యితర విధమైన పద్ధతుల నుపయోగించుటకు యింకను అవకాశము గలదు,

### పిల్లల ఉద్దేశము :— వారిని వ్యక్తులనుగ అంగీకరించుట :

తల్లిదండ్రుల ప్రథమ బాధ్యత ఏమనగా యితర వ్యక్తి విషయములో వారు మర్యాద, గౌరవము యేలాగు చూపెదరో ఆలాగే కుమారునికిగాని,

కుమార్తెకుగాని అట్టి మర్యాద గౌరవములు చూపవలసిన బాధ్యత తల్లి దండ్రులు కలిగియున్నారు. తల్లిదండ్రులు వారి పిల్లల ప్రవర్తనను గమనించుచు. వారి ఉద్దేశములను వినుచు. వారి ఉత్సాహమునకు తగినట్లు గౌరవమిచ్చుచు పరిష్కరించు విధానమును కనుగొనవలెను. తల్లిదండ్రులు తమ ఉద్దేశముల తెలుపుటకు వారికి అవకాశ మివ్వవలెను. ఇక్కడనే తల్లి దండ్రులు తఱచుగా తప్పిపోవునది. పిల్లల ఉద్దేశముల నలక్ష్యము చేయుట వల్ల కలుగు ఫలితము వారు మొండివారగుటయే. అట్టి తప్పులనే తల్లి దండ్రులయందు చూపెట్టి పిల్లలు వారిని యెదిరించి మాట్లాడుదురు.

## తల్లిదండ్రులు నమ్మతగిన వారుగ నుండవలెను :

తల్లిదండ్రులు గుర్తించుకొనవలసిన మరొక మూలసూత్రమును యిది బయలు పర్చుచున్నది. వారు తమ విషయములలోను, పిల్లల విషయము లోను నమ్మకముగ నుండి మంచి మాదిరిని పిల్లలకు చూపెట్టవలెను. చుట్ట పీల్చుట, సినిమాలకు వెళ్లుట. రాత్రివేళ ఇంటికి ఆలస్యముగ వచ్చుట, ఆబద్ధ లాడుట, త్రాగుడు మొదలైన లక్షణములు గలిగియుండు తండ్రి తన పిల్లలను అట్టి చెడ్డయలవాటులకు దూరస్థులుగ నుండవలెనని బుద్ధిమతు లిచ్చిన కుటుంబమున కెంత మాత్రమును లాభకరముగ నుండదు. అట్టి బుద్ధి మతులు గద్దింపులు పిల్లలయందెట్టి మార్పును కలిగించక వారు దానిని లక్ష్యము చేయకపోదురు. పిల్లలు తల్లిదండ్రుల మార్గముల నవలంబించుట యెంత తఱచుగ మనము చూచుచున్నాము. కాబట్టి మనము మన పిల్లలకు మంచి మాదిరి చూపవలెను.

## వారి నమ్మకమును, సహకారమును సంపాదించవలెను :

తమ పిల్లల నమ్మకమును సహకారమును సంపాదించుకొనుట తల్లి దండ్రులకు ముఖ్యము. ఉభయులు కలిసి చేయు పని అనేక సమస్యలను తీర్చి, తల్లిదండ్రులు పిల్లలు పరస్పర విచారణ ద్వారా తమ భేదాభేదములను పోగొట్టుకొనుటకు సహాయపడును. క్రమశిక్ష సమస్య తగ్గించి, ఉద్రేకము నణిపివేసి గృహింపు సహవాసము వృద్ధియగునట్లిది సహాయపడును.

**కుటుంబ కూటము :**

కుటుంబములోని క్రమశిక్ష మొదలగు సమస్యలను పరిష్కరించుకొనుటకు ఒక స్నేహితు డొక ప్రయోగము నుపయోగించుటకు ప్రయత్నించెను. తల్లిదండ్రులు పిల్లలు కలిసి సభ్యులుగ నుండు ఒక కుటుంబ కూటమును యేర్పఱచెను. ఇంటియందు పిల్లలు పనికి తప్పించుకొనుటను తల్లిదండ్రులు గమనించిరి. ఇంటి పనులు చేయుట తమ గౌరవమునకు లోటని తలంచి సేవకులే పనులన్నియు చేయవలెనని వారు నిరీక్షించిరి. కాబట్టి కుటుంబ కూటములో యోచించుటకు యీ విషయము మొదట తీసికొనబడెను. గృహములోని వారందరు యేదో ఒక పని చేయవలెనని తండ్రి మాట్లాడినప్పుడు పిల్లలు యధావిధిగా యట్టి పనులను చేయు జవాబుదారితనమునువహించుటకు నిరాకరించిరి. ఆ సమయమున కుటుంబమునకు వంట మనిషి వుండలేదు. కాబట్టి తల్లికూడను వంట చేయుటకు నిరాకరించిన యెడల వారి కందరికి కష్టము కలుగునని తండ్రి హెచ్చరించెను. తల్లి కది హెచ్చరిక మాటగా నుండినందున ఆమె వంట చేయుననియు, గృహమందొక పనివాడుండినప్పుడే వంట చేయబడునని చెప్పెను. ఇప్పుడు పిల్లలు తెలివి తెచ్చుకొని వాస్తవముగ తమకు భోజనముండదని తలంచిరి. ఈ యేర్పాటు ఫలించెను. పనియంతయు పనివారికే ఒప్పజెప్పుట అసంభవమనియు, తమ గృహ విషయములో తమకు కూడ జవాబుదారితన మున్నదని పిల్లలు గ్రహించగలిగిరి గనుక ప్రతిదినము యేర్పాటు చేయబడిన పనిని ప్రతి ఒక్కరు చేయుటకు సమ్మతించిరి. ఈ కుటుంబ కూటము ఎక్కువ పర్యాయములు కలిసికొనుట ద్వారా కుటుంబములోని కొన్ని ప్రాముఖ్యమైన సమస్యల ప్రేమపూరితముగ తీర్చికొనుటకు సహాయపడెను. ఇట్టి ఉదాహరణములనేకము చెప్పవచ్చును. తల్లిదండ్రులందరు యిందులో చెప్పబడిన విషయముల నెఱిగినవారుగను, యట్టి ఉదాహరణముల తమ కుటుంబముల లోనే తెలిసికొన్నవారుగను నుందురు. ఈ అధ్యాయమును ముగించక పూర్వము మూడు విషయముల నొక్కి చెప్పవలసియున్నది.

**గ్రహించుకొనుట :**

మొదట తల్లిదండ్రులు తమ పిల్లలను గ్రహించుకొనుటకు ప్రయత్నించవలెను. పిల్లలు తఱచు తమ ప్రవర్తన విషయము గ్రహించుకొనలేరు.

అది చెడ్డదనిగాని, తమ తల్లిదండ్రులు తలంచునట్లు ఆక్షేపణకరమైనదనిగాని, వారు తలంచరు. వివేకముతో పిల్లలకు సహాయము చేయుటకై చర్య తీసి కొనక పూర్వము తల్లిదండ్రులు పిల్లల ఉద్దేశమును అర్థము చేసికొనవలెను. బిడ్డఎందుకు తన యిష్టము వచ్చినట్లు ప్రవర్తించుచున్నదో అర్థము చేసుకొన గలిగిన వారి విషయమై తీసికొనవలసిన చర్యలో ఎక్కువ వ్యత్యాసముండును.

సహవాసము :

రెండవదిగ, తల్లిదండ్రులు పిల్లలతో సహవాసము చేయవలెను. ఇట్టి యనుభవము తల్లిదండ్రులు పిల్లలు పరస్పరముగ తెలిసికొనుటకు సహాయ పడుటయేగాక ఏకీభావమును స్నేహభావమును, పరస్పర విశ్వాసమును కలిగి యుండుట కదిమంచి మనస్సును కలిగించును. దాని ఫలితముగ వారు తల్లి దండ్రులయందు విశ్వాసముంచుటకు ప్రారంభింతురు. మఱియు సాధారణ ముగ పిల్లలకు దొరకని అమూల్యమైన బుద్ధిమతు లిచ్చుటకు తల్లిదండ్రుల కవకాశము కలుగును. ఈలాటి పిల్లల-తల్లిదండ్రుల సహవాస నిబంధన తగిన నటిపింపును చూపుట కర్హత లేనట్టియు, అలాగుచేయుటకు ఉత్సాహము లేనట్టివారియందు విశ్వాస ముంచకుండునట్లును చేయును. వారు వాస్తవ ములో వారికి తప్పభిప్రాయము నిచ్చి వారిని దూరపఱచుదురు.

మంచి ఉదాహరణము :

కడపటిదిగ, తల్లిదండ్రులు మంచి మాదిరిని వారికి చూపెట్టవలసి యున్నది, తల్లిదండ్రులు చెడ్డ అలవాటుగలవారుగ నుండి, తమ పిల్లలను వాటి నుండి తొలగిపోవుటకు విశ్వాస పూరితముగ బుద్ధిమతి చెప్పలేరు. తల్లిదండ్రులు వారి పిల్లల మొదటి ఉపాధ్యాయులుగ నున్నారు. పిల్లలు తల్లిదండ్రులను మించవలెనని కోరుదురు, పిల్లలు బాగుగా గమనించు వారనియు, వారు యితరుల నుండి ముఖ్యముగ తల్లిదండ్రుల నుండి మంచివి చెడ్డవి నేర్చుకొందురని అనుభవరీతిగ తెలియుచున్నది. ఒక బాలిక తన తండ్రితో యిట్లు చెప్పినది. "నీ నోటితో చెప్పవద్దు. నీ నేత్రములతో చెప్పుము. ఒక బాలుడు తన తల్లితో యిట్లు చెప్పెను. "నీవే దానిని చేయనప్పుడు దానిని చేయుమని మమ్మేల అడుగుదువు ?" కాబట్టి మన పిల్లల యెదుట తగిన మాదిరిని మనము పెట్టవలెను.

ప్రశ్నలు :

1. క్రమశిక్ష తల్లిదండ్రులలోనే ప్రారంభించవలెను. పై జెప్పిన వివరణకు నీవు సమ్మతించెదవా ? అలాగైన అది ఏలాటి క్రమశిక్షగ నుండవలెను ?
2. పిల్లలను శిక్షించుట తప్పా ? అలాగైన ఎందుకు ? అటుకాని పక్షమున పిల్లల కేలాటి శిక్ష విధించవలెను ?
3. ఏ పద్ధతివల్ల కుటుంబములో క్రమశిక్ష అభివృద్ధి చేయబడి, నిలువచేయబడి బలపర్చబడి యుండగలదు ?
4. క్రమశిక్ష సమస్య విషయములో బైబిలు నుండి మన మెట్టి జ్ఞానమును పొందుచున్నాము ?



# మీ పిల్లలతో కలిసి సంతోషించండి.

తఱచుగ తల్లిదండ్రులు యెక్కువగ పనిపాటలలో మునిగియుండుట వల్ల, వారు తమ పిల్లలతో కలిసివుండి వారిని గ్రహించుకొనుటకు వీలుకాదు. వారు భోజన సమయములందే వారిని కలిసికొందురు. కాబట్టి వారిని గుఱించి బాగుగ తెలిసికొనుటకు ఆ సమయము తగినంతది కాదు. ఇంతేకాక, బిడ్డను భోజన సమయములోనేకాక ఇతర స్థలములలో కూడ కలిసికొనుట ద్వారా బిడ్డయొక్క జీవిత విషయము యెక్కువగా తెలిసికొననగును. భోజన సమయమునకు సంబంధించిన కొన్ని యలవాటులున్నవి. తమ పిల్లలు భోజన సమయములలో యీ మర్యాదను అనుసరించవలెనని తల్లిదండ్రులు కోరెదరు. ఈ కూడిక విద్యుక్తమైనదిగా కనబడుచున్నది,

**పిల్లలతో నుండుము :**

పిల్లలతో నుండి సంతోషించవలెనన్న తల్లిదండ్రులు వారితో ఎక్కువ కాలము గడుపుట ముఖ్యము. వారు ఆటలాడునప్పుడుగాని, యింటియందు వున్నప్పుడుగాని తల్లిదండ్రులు పిల్లలతో ఆటలయందుగాని, చదువుయందు

గాని. కథలు చెప్పుటయందుగాని, షికారు వెళ్ళుటయందుగాని కొంత కాలము గడుపుట యవసరమని వారు గ్రహించవలెను. ఆలాగు గడిపిన సమయము లాభకరముగ గడుపబడినదిగ నుండును. పిల్లలు యెదుగుకొలది వారు వనభోజనమునకు వెళ్లుటకుగాని, తల్లిదండ్రులతో కొంతకాలము గడుపుటకు గాని, వారు యిష్టపడుదురు. కొన్ని సమయములందు వారిని అంగళ్ళకు గాని ఆటలాడు స్థలములకుగాని పిలుచుకొని వెళ్ళిన బాగుండును. ఈ వెవ్వేరు అవకాశములను నీవు వారితో నుండి నీ ప్రేమ విషయములోను. కారణ సహితమైన ప్రబోధ విషయములోను, క్రమశిక్ష విషయములోను యేలాగున ప్రవర్తించునది చూడగలవు,

పిల్లల సహవాసములో సంతోషపడవలెనంటే వారితో నుండవలెను. ఇది మొదటిదియు, ముఖ్యమైనదియునైన అవసరతయై యున్నది. బిడ్డ చిన్నదిగ నుండినప్పటికిని దానియందు అందము గలదు. అతని పోలిక, అతడు యేడ్చు విధము, అతని చిరునవ్వులు నీ ప్రేమ విషయములో అతడు ప్రవర్తించు విధము — ఇవన్నియు ఉద్రేకమును కలిగించు అనుభవములుగ నున్నవి. అలసిపోయి ఇంటికి వచ్చు తండ్రి విషయ మాలోచించుము. అతడు తన బిడ్డను చూచిన వెంటనే తాను అలసటను గురించి మఱచిపోయి బిడ్డతో ఆడుకొన ప్రారంభించును. అదే విధమున పిల్లలు నిలుచుటకు, నడచుటకు నేర్చుకొనునప్పుడును, వారు పెరుగుటను చూచునప్పుడును. వారు క్రొత్త విషయముల నేర్చుకొనునప్పుడును తల్లిదండ్రులకు యెక్కువ సంతోషము కలుగును.

## మాటలాడ నేర్చుట:

పిల్లలు కొన్నిమాటలు పలుకుటకు ప్రారంభించి, మాటలవలె శబ్దములు చేయుటకు ప్రయత్నించు సమయము వచ్చును. గ్రహించుకొనుటకు వీలు గానట్టియు, అర్థము లేనట్టియు, గుర్తించ వీలుగానట్టియు మాటలవంటి శబ్దములు బిడ్డ చేయునప్పుడు తల్లిదండ్రులమితముగ సంతోషించెదరు. బిడ్డ యొక్క యీ జీవిత దశయందు తనను గురించి బయలుపఱచుకొనుటను చూచుటవల్ల తల్లిదండ్రులకు సంతోషము కలుగుచున్నది. బిడ్డ పెరుగుటను వారు చూచెదరు. ఆకర్షణ గోచరమైనట్టియు, భావ్యమైనట్టిదియునై యున్నది. మొదటిదానికంటె రెండవ లక్షణము ప్రధానమైనది. కాబట్టి బిడ్డ అభివ్ర

ముగ నుండినను, తల్లిదండ్రులతనిని ప్రేమించి, యెత్తుకొని తమ మంచి వస్త్రములు చెడగొట్టినను లెక్కించరు. వారతనివైపు నాకర్షింపబడి నట్లగుపడును.

## వారి వ్యక్తిత్వమును తెలుసుకొనుట :

పిల్లలభివృద్ధిచెందుకొలది వారు స్వతంత్రమును సూచించు లక్షణములను కనుపరచెదరు. వారు తమ పనిని వారికిష్టమైన విధముగను, వారికి యిష్టము వచ్చినప్పుడు చేయుటకిష్టపడుదురు. ఇష్టాయిష్టములను చూపుచు, స్నేహితులను, ఆడుకొను జతవారిని యేర్పాటు చేసుకొనుటలో స్వతంత్రము కలిగియుండవలెనని ఎక్కువగ ప్రయాసపడుదురు. కొన్నిసమయములందు వారు తల్లిదండ్రులకు అమర్యాదకరముగను అవిధేయతగను ప్రవర్తించెదరు. ఇది తరుచుగ తల్లిదండ్రులకు కోపము కలిగించును. వారి పిల్లలు మంచి వారుకారనియు, వారు తప్పుమార్గములలో పోతున్నారనియు తల్లిదండ్రులు తలంచుటకు ప్రారంభించెదరు. ఈలాటి అవసరమైన తీర్మానమునకు వచ్చుట పొరబాటు. ప్రతిపిల్లవాడు తన ప్రాముఖ్యతను గ్రహించు కొన్నప్పుడు, తాను కూడ ఒక వ్యక్తినని తెలుసుకొనినప్పుడును యతని జీవితములో కొన్ని ఘట్టములు (అంతస్థులు) వున్నవని తల్లిదండ్రులు తెలిసి కొనవలసియున్నది. ఇది చెడ్డ లక్షణము కాదు. వాస్తవములో బిడ్డ పెరుగుచున్నదనియు, పిల్లలందరు అట్టి అనుభవము పొందెదరనియు అది తెలుపుచున్నది.

పిల్లలు తమ యిష్టపూర్వకముగా పెరుగుటకు వదలవలెనని తల్లి దండ్రులు జ్ఞాపకముంచుకొనవలసిన ముఖ్యవిషయములలో నొకటియైయున్నది, అయితే వారు పిల్లల విషయము గమనము కలిగి, వారు తప్పిపోకుండ చూచుకొనవలెను. ఇద్దరు వ్యక్తులు ఒకే విధముగ నుండరు. కాబట్టి బిడ్డ తన స్వంత మార్గము నవలంబించుచు, తనను ఒక వ్యక్తిగా అభివృద్ధి పరచుకొనవలెనని తలంచుకొనుట ఒక ముఖ్యవిషయమై యున్నది, బిడ్డ యొక్క అవసరతలను తెలిసికొనుటకును అట్టి సహాయము వారి కిచ్చుటకును తల్లిదండ్రులు అతని విషయముగ మనము గలిగి యుండవలెను. ఇది కూడను తల్లిదండ్రులకు ఒక విధమైన సంతోషము నిచ్చును. పిల్లలు తల్లి దండ్రులు కోరినట్లును వారి మార్గముల ననుసరించి చేయుట తల్లిదండ్రుల

సంతోషమునకు తృప్తికి ఆధారము కాదు. అయితే వారు తమ స్వంత విధమునను, సరియైన విధమునను చేయుటయందే ఆధారపడియున్నది. కాబట్టి తల్లిదండ్రులు పిల్లలను అప్పుడప్పుడు నడిపించవలెను. లేనిపక్షమున అతని కిష్టము వచ్చినట్లు తన పనిని చేయుటకు వదలవచ్చును. పిల్లలు వేరువిధమున చేయునప్పుడును తప్పు మార్గములో నడచునప్పుడును తల్లి దండ్రులు లక్ష్యము చూపవలెను.

బొమ్మలు కాదు, విగ్రహములు కాదు :

పిల్లలు చిన్నవారుగ నుండినప్పుడు తల్లిదండ్రులు ఒక విధమైన తృప్తిని కలిగియుందురు. అయితే వారు పెద్దవారుగ పెరుగుకొలది తల్లి దండ్రులు వేరువిధమైన తృప్తినిపొంద నిరీక్షించవలెను, ఇప్పుడు పిల్లలు సహవాసులుగ నున్నారు. జీవితములో తల్లిదండ్రులే వారికి సమస్తమను తత్వమును మానుకొనుటకు మధ్యవయస్సు పిల్లలు తలంచెదరు, తల్లి దండ్రులు పిల్లలు బొమ్మలని భావింపక వారు మానవమాత్రులని గ్రహించెదరు, అప్పుడు వారు వేరువిధమైన సంబంధ మభివృద్ధిచేయుటకు ప్రారంభించెదరు. ఈ వయస్సులోని పిల్లలను తల్లిదండ్రు లదివరకు బొమ్మలనుగ భావించినట్లు గాక వారిని వ్యక్తులనుగ లెక్కించవలెను. వారి యెడల చూపు మనస్సు మార్పు పరస్పరముగ సహాయపడును.

పిల్లలు తమ రహస్య విషయములను తమ స్నేహితులకు తెలుపు కొనుటకు ప్రారంభించుట తల్లిదండ్రులు గమనించెదరు. ఇది స్నేహితుల విషయములో తల్లిదండ్రులకు అసూయత కలిగించకూడదు. వాస్తవములో వారి జీవితములలోని ఈ యభివృద్ధికి వారు సమ్మతించి, స్నేహితులను యేర్పరచుకొను విషయమునందు సహాయపడవలెను. ఈ దశలో పిల్లలు వారి తల్లిదండ్రులను వారి స్నేహితులుగ కూడ భావించెదరు. కాబట్టి తల్లిదండ్రులకును పిల్లలకును మధ్య యిచ్చి పుచ్చుకొను సంబంధ దశ ప్రారంభమగును. పిల్లలు తమ వ్యక్తిత్వమును బలపరచుకొని, తమ యభిప్రాయములు, తీర్మానములు ముఖ్యమైనవిగ భావింప ప్రారంభించెదరు. కావున ఈ దశయందు వేరువిధమైన సహవాసము అవసరమై యున్నది. గ్రహించుకొనుతల్లిదండ్రులు పాత సిద్ధాంతముల విడచి, యీ నూతన సహ వాసములో ప్రవేశించవలెను, దానిని యెవరుచేయుదురో వారు పిల్లలతో నుండగల నూతన సంతోష మనుభవింతురు,

ఈ దశలో పిల్లలు తమ తల్లిదండ్రులతో తమాషగ నుండుటకు ప్రారంభించెదరు. తల్లిదండ్రులుగాని, అతిథులుగాని ఇంటియందున్నప్పుడు బిడ్డ వారుకూర్చున్న గదిలో ప్రవేశించి, అక్కడ యితరు లెవరుగాని లేరను భావనతో ఈలవేయుచు గదిని దాటిపోవును ; లేక తల్లిదండ్రుల దగ్గరకు వెళ్ళి ఏదో ఒక తమాషా చేయును. ఈ చిన్న ప్రదర్శనములను, చిలిపి చేష్టలను తల్లిదండ్రులు తమాషాలుగ భావించవలెను — ముఖ్యముగ పిల్లలు చేష్టల విషయములో గర్విష్ఠితనము చూపు లక్షణము లేనప్పుడు. ఈ విషయములలో తల్లిదండ్రులు అయిష్టము చూపిన యెంత మాత్రము సహాయ కరముగ నుండదు. బిడ్డకు బుద్ధిమతి చెప్పుటవసరమని వారికి తోచిన వారతనికి బుద్ధి చెప్పుటకును. సలహానిచ్చుటకును మరొక తరుణము కొఱకు కనిపెట్టవలెను. అట్టిసమయమందు మాత్రము దానిని త్రోసిపుచ్చవచ్చును. లేదా తమాషగా భావించుకొన వచ్చును. వారు హాస్యరసభావమును చూపెట్టవలెను.

ఈ దశలో తల్లిదండ్రుల అతిశయము, సంతోషము, తమ పిల్లలు ఎదుగుచు త్వరలోనే వారివలె వారుందురను విషయముపై నాధారపడి యున్నది. పిల్లల స్వతంత్రత, తమ విషయము జాగ్రత పుచ్చుకొనగల శక్తి, పాఠశాలయందు వారి మంచిపని, ఆటలయందు వారి జయము మొదలగు విషయములు వారికి సంతోష కారణములగుచున్నవి. తమ పిల్లలు సాధించిన కార్యములు తమవైనట్టుగ భావించి దాని విషయమై తల్లిదండ్రులు సంతోషించెదరు.

## పిల్లలు సహాయకారులు :

పిల్లలు పెద్దవారగుకొలది వారు తల్లిదండ్రులకు సహాయకారులగు చున్నారు. పాఠశాలకు వెళ్ళనప్పుడును, ఇంటియందేదైన పని కలిగియున్నప్పుడును, బాలికలు తల్లులదగ్గరను, బాలురు తండ్రుల దగ్గరను యెక్కువ కాలము గడుపుదురు. సహాయము చేయుచు, వారు కొన్ని విషయముల నేర్చుకొందురు. బాలికలు వంటచేయుట, కుట్టుట, అల్లుట మొదలగు గృహసంబంధ పనులను నేర్చుకొందురు. ఈలాగే బాలురు తండ్రి దగ్గర నుండి ఆయనచేయు పనులన్నియు చేయుటకు వారు నేర్చుకొందురు. ఆయన వ్యాపారస్థుడైనను, వ్యవసాయదారుడైనను వారాయనకు సహాయకారులుగ

నుందురు. నూతన సహవాసము సహితము, వృద్ధియగుటకు వారికి తరుణము కలిగించును. ఈ దశ పిల్లలజీవితములో ముఖ్యమైనదిగనున్నది. మిక్కిలి చిన్నపిల్లలుగ నుండినప్పుడు వారి కేలాగు తల్లిదండ్రుల సహాయ మవసరమైయుండెనో యీ వయస్సు పిల్లలకు వారి సహాయమంత యవసర ముగ నున్నది. చిన్న బిడ్డలుగ నున్నప్పుడేలాగు వారు సంరక్షకులుగ నుండిరో యిప్పుడు వీరికి బుద్ధిమతులిచ్చుటకు వారు అవసరమై యున్నారు.

ఎదుటి జాతి :

పిల్లలు యౌవన దశకు వచ్చునప్పటికి వారు ఎదుటియందు ఆశను చూపుటకు ప్రారంభించెదరు. బాలురు బాలికలతోను, బాలికలు బాలురతోను సంభాషించుటకు యిష్టపడుదురు. బాలురు బాలికలు కలిసి సభలలో పాల్గొన యిష్టపడుదురు. మిక్కిలి నాగరికతగల కుటుంబములోని బాల బాలికలు ఒకరి నొకరు గృహములందు దర్శించుటకు ప్రారంభింతురు. కొన్ని సమయములందట్టి స్నేహము తల్లిదండ్రులకు కలతలను గలిగించు కారణ మగును. అయితే వారు గౌరవ అంతస్థులలో నుండిన, వారు తల్లి దండ్రులకు సంతోషమును కలిగించు వారగుదురు. పిల్లలకు జాతి సంబంధ విషయములందు తల్లిదండ్రుల సహాయమవసరము. తల్లిదండ్రులు జాతి విషయము వారికి బోధించుటకు తరుణము కనిపెట్టవలయును. ఇతరులు చెప్పు తప్పభిప్రాయములను నేర్చుకొనుటకంటె. తమ మేలు కోరుటలో ఆశగలవారైన తల్లిదండ్రుల నుండి యట్టి విషయములను నేర్చుకొనుట మంచిది. అనేక సమయములందు పిల్లలు సిగ్గుపడుదురు కాబట్టి అట్టి విషయములను గురించి, తల్లిదండ్రుల నడుగుదురు. అయితే పిల్లలడుగు వఱకు తల్లిదండ్రులు కనిపెట్టగూడదు. పిల్లలయొక్క యవసరతను తల్లి దండ్రులు గ్రహించి, జాతికి సంబంధించిన విషయములు వారికి తెలియ జేయుటకు సమయము, తరుణము కనుగొనుటకు యత్నించవలెను.

పిల్లల పెరుగుదల మొక్కయొక్క పెరుగుదలవలె నున్నది. తమకు పిల్లలున్నారనియు, వారు యెదుగుటకు వారికి సహాయపడవలెననియు తల్లి దండ్రులు సంతోషపడుదురు. వారు పెద్దవారుగ యెదుగుచు తమ వ్యక్తి త్వమును బయలుపర్చుటను తల్లిదండ్రులు చూచునప్పుడు వారమిత సంతోష

ముతో నిండినవారగుదురు పిల్లల జీవితములలో సాధించు లక్షణము తల్లిదండ్రుల సంతోషమునకు ముఖ్యకారణ మగుచున్నది. పిల్లలు వివాహితులై తమ సంసారములను స్థిరపరచుకొని సంతానము కలవారైనప్పుడు తల్లిదండ్రులు — పిల్లలు అను సంబంధములో నూతన మెట్టు ప్రారంభించును. వివేకవంతులు సంతోషముగ నుండి యిప్పుడు వారు పితామహులుగ తృప్తిగలవారుగ నున్నారు.

ప్రశ్నలు :

1. తల్లిదండ్రులు, పిల్లలు — వీరి మధ్య సహవాస సంబంధములు కలిగించి, సంతోష మనుభవించువారినిగ చేయుటెట్లు ?
2. తల్లిదండ్రులు పిల్లలు కలిసి ఉల్లాసముగ మెలగునట్లు చేయుట కెట్టి పనులను సహాచేయుదువు ?
3. కుటుంబారాధన, ఒక కూడికమైన ఆత్మీయానుభవమునకు సాధనముగ యెట్లు చేయబడగలదు ?



# కుటుంబమందలి మతము

మతము ప్రాముఖ్యమైనదిగ నెంచని కుటుంబము హిందూదేశములో అరుదుగ నున్నది. హిందూదేశములో ప్రతిదిన జీవితము ఏదైన నొక మత శాఖకు సంబంధపడియుండును. లౌకిక బలము జనులను మతము నుండి ఎడాబాపు చేయలేదు. ఏ రాజకీయ, ఆర్థిక శాఖలకు చెందినవాడైనను అత డేదో ఒక మతమునకు సంబంధము కలిగియుండుటకు ఆశించును.

### కుటుంబమందలి మతావలంబన :

కుటుంబమందలి మతము నిజముగ యేమి తెలుపును ? దీనికి రెండు జవాబులు చెప్పవచ్చును. మొదటిదిగ, కుటుంబము కొన్ని ఆచారములకు కట్టుబడి వాటిని విశ్వాసపూరితముగ నభ్యసించుచుండును. ఉదాహరణముగ క్రైస్తవ కుటుంబములో బైబిలు పాఠము చదువుటద్వారానో, ప్రార్థనద్వారానో

ప్రతిదిన కార్యక్రమము ప్రారంభమగును; ఆదివారమునందా కుటుంబము గుడికి వెళ్ళును; బిడ్డ జన్మించితే యా బిడ్డ బాప్తీస్మము పొందును; క్రిస్మస్ పునరుత్థాన పండుగలు కుటుంబములో విశేష సమయములుగ నున్నవి. ఇది మతములోని విద్యుక్తమైన భాగముగ నున్నది. ఒక వ్యక్తి ఈ యాచారముల నన్నిటిని చేయవచ్చును. అయితే స్త్రీగాని, పురుషుడుగాని నిజమైన మతవైరాగ్యము లేనివాడుగ నుండవచ్చును. రెండవదిగ. కుటుంబములో మతము నభ్యసించుటయనది ఆచారముల నాచరించుట మాత్రమే కాదుగాని మతసూత్రముల కనుగుణ్యముగ జీవించుచు ప్రతిదిన జీవితములో దానిని ప్రదర్శించవలెను.

### తల్లిదండ్రుల బాధ్యత :

తల్లిదండ్రులు తమ యనుభవమును పిల్లల కందించ బద్ధులై యున్నారు. వారు తమ జీవితములకది ప్రాముఖ్యమైనదను భావముతో వారి విశ్వాసముకొద్ది జీవించుచున్నందున, వారు తమ పిల్లలను ఆ మత సత్యములనే గ్రహించుకొనునట్లును వారి యనుదిన జీవితమునకది చాల ముఖ్యమైనదనియు, మతము ఒక జీవముగల శక్తియనియు, వారు గ్రహించు కొనునట్లును వారిని నడిపించవలెను. వాస్తవముగ నిది సులభ సాధ్యమైన పనికాదు.

### సంఘము, పాఠశాల, తెగ :

సంఘము, పాఠశాల తెగ మొత్తముగ యీ సమస్యనే యెదుర్కొనవలసియున్నది. ఒక కుటుంబములో బిడ్డ జన్మించును. అయితే ఆతడేదో ఒక పాఠశాలలో విద్యార్థిగను, ఏదో ఒక గుడికి వెళ్ళుచు, ఏదో ఒక సంఘమునకు సంబంధము కలిగియున్నాడు. అతడు పలువిధములైన పరిస్థితులలో జీవించుచున్నాడు. కాబట్టి తల్లిదండ్రులేకాక ఇతర గుంపుల వారుకూడను బిడ్డయొక్క ఆత్మీయ జీవితాభివృద్ధి విషయము అభిలాషగలవారై యున్నారు.

### సంఘము యొక్క వైఖరి :

ప్రస్తుత కాలపు ందూదేశములో పాఠశాల, సంఘము ఏ ఒక్క మతమునందు అభిలాషగలవిగలేవు, మన పాఠశాలలోను, పరిసరములలోను యీ విధముగనే యున్నది. ప్రభుత్వము లౌకికమైనదగుటచేత ఏ ఒక్క

మతమునందుగాని అభిలాషను, దయను చూపకను సర్కారు పాఠశాలలో మతబోధలను నేర్పుటకు ఒప్పుకొనలేదు. అదేలాగున మన పరిసరములు యెక్కువగ క్రైస్తవేతరులు గలవిగ నుండి యనేక మతముల నవలంబించు వారుగ నున్నారు. కాబట్టి వారే ఒక్క మతమునందుగాని అభిలాష చూపుట లేదు. ఈ కష్టములవల్లను, భేదములవల్లను యౌవనుల ఆత్మీయాభివృద్ధి విషయములో సంఘము యొక్క అభిలాష కొరతపడియుండ నవసరములేదు.

దురదృష్టవశాత్తు యట్టి పరిస్థితి యంత సామాన్యమైనది కాదు. ముఖ్యముగ స్వల్ప సంఖ్యాకుల దృష్టితో చూచినప్పుడు స్వల్ప సంఖ్యాకులై హిందూదేశమంతటను స్వల్పముగ వ్యాపించియుండు క్రైస్తవ సంఘము యీ దినములందు ఒక క్రొత్త ప్రమాదమునకులోనై యున్నది. ఈ ప్రమాదము అసంఖ్యాకులుగ నుండు సంఘము నుండి వచ్చినదై, ఒక తంత్రముతో కూడిన స్వరూపమునుదాల్చి యున్నది. హైందవ నాగరికత యను మిషతో హిందువుల అలవాటులను, ఆచారములను ముందుకు పెట్టి, అవి రాజకీయమునకు సంబంధించిన సభలు. ప్రదర్శనములు, ఆచారములు మొదలైన వాటియందు అనుసరించుట మనము చూచుచున్నాము. పాఠశాలలయందు నుపయోగించు క్రొత్త పుస్తకములయందు కూడను యెక్కువగ హిందూ పౌరాణిక విషయముల కలిగియుండి, ఒక హిందూపక్షమువారు హిందూమత సంబంధమైన పండుగలలో క్రైస్తవులను, ఇతర అల్పసంఖ్యాకులుగ నుండు సంఘమువారిని పాల్గొనునట్లు బహిరంగముగ ప్రబోధించుచు. బలవంత పెట్టుచుకూడ నున్నారు. వాస్తవములో క్రైస్తవులు జాతీయ సద్భక్తిగల వారుగ నున్నారాయని పరీక్షించుటకే వారు యీ పండుగల నాచరించుచున్నారు.

పక్షపాతమైన ఆత్మీయ ప్రేరణ :

ప్రస్తుతము హిందూదేశమందు ఒకొక్క తెగయొక్క ఆత్మీయ ప్రేరణ అందరును సామాన్యముగ ననుసరించ దగినదిగ లేదని కనబడుచున్నది, అది ఒక పక్షమునకు సంబంధించినదై యితర మతములకు ముఖ్యముగ అల్పసంఖ్యాకుల అలవాటులకు వ్యతిరిక్తముగ చేయుచున్నట్లగుపడుచున్నది. క్రైస్తవతల్లిదండ్రులైన మనలను చిక్కులలోనికిది తెచ్చుచున్నది. ఇది క్రైస్తవ సంఘముపైన యెక్కువ బాధ్యతను పెట్టుచున్నది. క్రైస్తవ పాఠశాలలు తగ్గుచు, క్రైస్తవ పిల్లలు ఆత్మీయ ప్రేరణ కలిగించ

నట్టియు పక్షపాతము చూపునట్టియు, హిందూలక్షణములు గల క్రైస్తవేతర పాఠశాలలకు వెళ్ళవలసివచ్చినప్పుడు తల్లిదండ్రులును, సంఘమును పిల్లలను క్రైస్తవ విశ్వాసమందు తగిన విధముగ పోషించుటకు శ్రద్ధవహించవలసి యున్నది.

## గతించిన కాలమందలి అశ్రద్ధ:

సంఘమును, తల్లిదండ్రులును యీ బాధ్యత విషయములో గత కాలమందు కొంత మట్టుకు శ్రద్ధ చూపియున్నారు. గతకాలమం దెందరో క్రైస్తవ పిల్లలు మిషను పాఠశాలలకుగాని, కళాశాలలకుగాని వెళ్ళుచు, బోర్డింగులలో నివసించుచుండినందున తల్లిదండ్రులు తమ పిల్లల ఆత్మీయ అవసరతను యీ పాఠశాలలు, బోర్డింగులు చూచుకొనునను విశ్వాసము గలవారై యుండిరి. కాబట్టి పిల్లల ఆత్మీయ పోషణకొరకై తగిన బోధనా కార్యక్రమము ఆదివార బళ్ళలోను, యౌవన సమాజములందును తప్ప మన సంఘము మరే కార్యక్రమమునుగాని అనుసరించుటలేదు. మొత్తముపైన తల్లిదండ్రులు తమ పిల్లల ఆత్మీయ పోషణ కొరకు పాఠశాలలు, సంఘము చేయుచున్నదానితో తృప్తిగలిగి యుండిరి. ప్రస్తుతకాలమందు నిర్వహించు చున్న శ్రద్ధ తగినంతది లేదనియు, వెలుపట నుండి అపాయము కలుగవచ్చు ననియు గ్రహించుకొని క్రైస్తవ నాయకత్వము యీ విషయమై దీర్ఘముగ యోచించుచున్నది. తల్లిదండ్రులకును, సంఘములకును ఇది ఒక వాలుగా కనబడుచున్నది. ఇంకను క్రైస్తవానుభవమునకు ఆధారమైనది గృహమని మున్ముందు పెట్టబడుచున్నది. తమ మత విశ్వాసములందును, అనుభవము లందును పిల్లలతో పాలివారుగ నుండుట కీ గొప్పపని తల్లిదండ్రులకు సవాలుగ నున్నది.

## మన గురి:

పిల్లల ఆత్మీయ తర్ఫీతు విషయములో మన యెదుట ఏ గురి పెట్ట బడినదో అదే గురియే పరిశుద్ధ గ్రంథములలో కనబడుచున్నది. "యేసు జ్ఞానమందును, వయస్సునందును యెదుగుచు, దేవుని దయయందును, మనుష్యుల దయయందును వర్ధిల్లుచుండెను." అని పరిశుద్ధుడైన లూకా సువార్తయందు వ్రాయబడి యున్నది. పాతనిబంధనలో ప్రవక్తయైన

సమూయేలును గురించి అలాగుననే చెప్పబడియున్నది : "బాలుడైన సమూయేలు పెరుగుచు, దేవుని దయయందును, మనుష్యుల దయయందును వర్ధిల్లుచుండెను." పాతనిబంధన నుండియు, క్రొత్తనిబంధన నుండియు చెప్పబడిన యీ రెండు విషయములు తల్లిదండ్రులు తమ పిల్లల జీవితము లందేమి యుద్భవింప చేయవలయునో వివరణముగ చూపుచున్నది. వారి పిల్లలు దేవుని దయను పొందవలెననునదియే యీ గురియై యున్నది.

కష్టములు :

ఈ గురిని నెరవేర్చుకొనుటకు యిది మిక్కిలి ఔన్నత్యమైనట్టియు, కష్టసాధ్యమైనట్టియు ఆదర్శముగ నున్నది. ప్రభువు దర్శనము పొందని తల్లిదండ్రులు తమ పిల్లలను దేవుని గురించిన విషయముల గ్రహించుకొను టకు నడిపించునట్టి అవసరతను వారు గ్రహించుకొనుటగాని మెచ్చుకొనుట గాని లేదు. బలమైన లౌకిక ప్రేరేపణ కలిగి మతమును మాయగా భావించు గృహములందు యిట్టి విషయము మనకు కనబడును. అదేలాగున తగిన విద్యలేని తల్లిదండ్రులు తమ పిల్లలకు తగిన నేర్పుల నిచ్చుటకు వెనుక పడినట్లు వారే తెలిసికొందురు. ఇట్టి విషయమందు వారు వెనుకపడడము వారి ఉపయోగమును మితపరచి వారి పనిని కష్టతరముగ చేయును. కొందరు తల్లిదండ్రులు క్రైస్తవేతర పరిసరములకు లోనై పోవుటవల్ల తమ పిల్లలకు ఆత్మీయ విషయములలో నెట్టి సహాయము నివ్వవలెనో వారికి తెలియదు.

మంచి సాదృశ్యము చూపుట :

ఈ కష్టములు రాబోవు దినములలో నధికమగును. అయితే అవియే మన కొక సవాలుగా కూడ యేర్పడును. అట్టి సందర్భములలో మన మేమి చేయవలసియున్నది ? తల్లిదండ్రులు తమ జీవితములలో విశ్వాసపూరితమైన అభ్యాసములు గలిగి, జీవితములలో తమ్మును ఎదిరించునట్టి సందర్భములందు నిజమైన ఆత్మీయావేశమును మతమును గ్రహించుకొనజేయు విషయములను వివరించుట వారి మొదటి పనియైయున్నది. తమ్మును కష్టములు ఎదుర్కొ న్నప్పుడు అనేక విధములైన శోధనలకు లొంగి, దేవుని మంచి తనమును మరచిపోవు తల్లిదండ్రులు తమ పిల్లలకు దేవుని మంచితనమును గూర్చి చెప్పుటవల్లగాని, కష్టపరిస్థితి కలిగినప్పుడు వారు దేవునియందు నమ్మిక గల

వారుగ నుండవలెనని బోధించుటవల్లగాని ప్రయోజనముండదు. కుటుంబములో వ్యాధియుండినప్పుడు ఒక మంత్రిగానిని పిలుచుకొన్న క్రైస్తవ భార్యభర్తల గురించి చెప్పబడినది. మనవారు విశ్వాసమునందెంత బలహీనులుగ నున్నారని చెప్పుట కనేక సాదృశ్యములు గలవు. అదేలాగున తల్లిదండ్రులు తమలో తాము జగడమాడినను, లేక ఒకరి యెడల నొకరు అవిశ్వాసులుగా నుండినను వారు దేవుని దయయొక్క గొప్పతనమును పిల్లలయెడ వారికిగల పవిత్రతను బోధింపజాలరు. త్రాగుబోతుగ నుండి తరుచు తన భార్యను, పిల్లలను కొట్టుచు, వారి విషయమైన జాగ్రత తీసికొనని తండ్రి యొక్క కుమారుడు దేవుడు తండ్రియై యున్నాడను భావమును గ్రహించుకొనజాలడు, తన తండ్రి అంత చెడ్డవాడగుటచే యితర ప్రతి తండ్రియు ఆ విధముగనే యుండునని తలంచును, దేవుడు తండ్రియైన ఆయన కూడ తన తండ్రి వలెనే వుండవచ్చుననియు, కాబట్టియే వేదములు ఆయనను వర్ణించినట్లు అతడాయనను అంగీకరించడు. తల్లిదండ్రులు దేవుడు తండ్రియైన ఆయన కూడను తన తండ్రివలెనే నుండవచ్చునను భావముతో వేదము లాయనను వర్ణించినట్లు అత డాయనను అంగీకరించడు. తల్లిదండ్రులు తమ అనుదిన జీవితమునందు తమ మతము ననుసరించి జీవించుట మొదటిదియు ముఖ్యమైనదియునై యున్నది.

## క్రైస్తవ పండుగలు :

రెండవదిగ క్రైస్తవ పండుగలను ఆచారములను పాటించుటయందుగల ప్రాముఖ్యతను తల్లిదండ్రులు చూపవలసియున్నది. వారందరు ఒక కుటుంబముగ ఆలయమునకు వెళ్ళి, సంఘ పనులన్నిటిలో పాల్గొనవలెను. పిల్లలకు తగిన క్రైస్తవ సహవాసమును కలిగించు ఆదివార బడికి, క్రైస్తవ యత్నసమాజమునకు, యౌవన సమాజమునకు, తదితర యౌవన సంఘములకును వారు తమ పిల్లలను పంపవలెను.

## క్రైస్తవ గృహనిర్వాహకత్వము :

క్రైస్తవ తల్లిదండ్రులు గృహనిర్వాహకత్వము నభ్యసించుచు, తద్వారా వారేలాగు వారి సమయమునకును, తెలివికిని, స్వాస్థ్యములకును కార్యకర్తలగుచున్నారో చూపెట్టవలెను. ఇది జీవితమునకు క్రైస్తవ లక్షణము నిచ్చి, గృహమంతటికిని దాని ఫలితమునిచ్చును. కుటుంబములో గృహనిర్వాహ

తత్వమును అలవర్చుకొన్నప్పుడు పిల్లలు కూడను జీవితమును వేరుగా చూచెదరు. అట్టి కుటుంబములోనివాడు తన జీవితమును దేవుని వరముగ భావించి అలాగే జీవించును, జీవితములో తనకు కల్గినవన్నియు తనకు చెందినవి కావనియు, అవి తన ఉపయోగార్థ మివ్వబడినవనియు గ్రహించు కొనును. ఇది మనుష్యునియందు తృప్తిగల హృదయమును వృద్ధిచేయును, అట్టి మనుష్యుడు జీవితమందలి అనానుకూలములను గుఱించి సణుగక యుండును, జీవితమందు కష్టసమయములున్నవనియు, అవి అర్థగింపబడ వీలు కావనియు అతడు గ్రహించుకొనును.

## జీవితము నెడల భక్తిపూర్వకమైన వైఖరి :

పిల్లల ఆత్మీయ పోషణలో వారియందు జీవితము నెడల చూపవలసిన భక్తిపూర్వకమైన వైఖరిని సృష్టించవలెనను విషయమిమిడియున్నది. వారు ఆత్మీయ విషయములను గుఱించియు, సంఘమును దాని నాయకుల విషయము చులకనగా చూడగూడదనియు, మాటలాడ కూడదనియు దీని భావము, పొరుగువారి విషయము దుష్ప్రచారము చేయకూడదు. ఈలాటి జీవిత పునాది గృహమందే వేయబడుచున్నది, తల్లిదండ్రులు గృహములందు జాగ్రతగా తమ సంభాషణలను చేసి, తమ కిష్టమైన విధముగ పిల్లల యెదుట మాట్లాడిన యెడల, పిల్లలుకూడను ఆలాటి వైఖరిని అలవాటులను నేర్చుకొని తమకు తెలియని విధమున తమ జీవితములో వాటిని బయలుపర్చుచున్నారు.

## కుటుంబారాధన :

మతానుసరణి జీవితమునకు కుటుంబారాధన ఒక మూలరాయిగానున్నది. కుటుంబమందలి వారిని మతానుసరణ పోషణలో యభివృద్ధిచేయు మార్గము ఇదియే. ఇది అన్ని మార్గములకంటెను శ్రేష్ఠమైనదిగనున్నది. ఈ విధానము కుటుంబములోని వారిని దేవుని సామీప్యములోనుండునట్లును, తమలో తాము హత్తుకొని వుండునట్లును. ఇతరుల సాంగత్యములో నున్నప్పుడు వారిని దేవుని సామీప్యములో నుండునట్లునను చేయును. వారి అనుదిన జీవితమునకు వలసిన ఆత్మీయ శక్తిని బలపరచుకొనుట కిది సహాయపడును. కుటుంబ ఆరాధనలో పిల్లలు మత విషయముల నవలీలగ మాట్లాడుటకును, తమ మతానుభవముల వెలిబుచ్చుటకును, తమ కొఱకు, ఇతరుల కొఱకు ప్రార్థించు

టకును, పరిశుద్ధ గ్రంథములను, క్రైస్తవ పాటలను గ్రహించుకొనుటకు, వర్తమాన భూతకాలములలోని విశ్వాసుల అనుభవములలో ప్రవేశము గలిగి యుండుటకును నేర్చుకొనెదరు.

ప్రశ్నలు :

1. మన పిల్లలకు క్రైస్తవ పోషణను కలిగించుటలో మన కెట్టి కష్టములు అడ్డువచ్చుచున్నవి ? వాటిని మన మెలాగు యెదుర్కొనవలెను ?
2. " కుటుంబమందును, వెలుపటివారితోను, సహవాస విషయములోను, ఆట పాటల విషయములోను, ప్రేమ - వివాహ విషయములోను, పద్ధతులు - నీతుల విషయములోను కుటుంబ మతాసక్తియొక్క ఫలితము ఒకానొక దినమున కొలువబడును." దీనికి సమ్మతించెదవా ?
3. కుటుంబ మత జీవితములో కుటుంబ ప్రార్థనా ప్రాముఖ్యతయేమి ?
4. మీ తీర్మానము కొరకై మీ పిల్లను మీ దగ్గరకు తెచ్చు కొన్ని మతసమస్యలేవి ?



# పిల్లలు ప్రశ్నలు అడుగుదురు

పిల్లలు మాట్లాడుటకు ప్రారంభించక పూర్వమే, తాము ఎదుగుచుండగనే తమ పరిసరముల తీవ్రముగ పరిశీలించ మొదలిడుదురు. అదియంతయు యేమిటని తెలిసికొనగోరుదురు, కాబట్టి వారు చుట్టును ప్రాకుదురు, మంచిదిగాని, చెడ్డదిగాని, శుభ్రమైనదిగాని, అశుభ్రమైనదిగాని, అపాయకరమైనదిగాని, నిరపాయకరమైనదిగాని ప్రతివస్తువును ముట్టుకొనెదరు. తరుచుగ వారు కాల్చుకొనుట, వ్రేళ్ళను కోసికొనుట ద్వారా తమకు హాని కలిగించుకొనుటను మనము చూచుచున్నాము. అయితే వారంతటితో నిరుత్సాహపడక తమ పరిసరముల పరిశోధించుచు అది యేమి ఇది యేమి యని కనుగొనుటకు ప్రయత్నింపజూతురు.

పిల్లలు మాట్లాడనేర్చిన వెంటనే వారి చుట్టునుండు వాటిని గుఱించి తెలుసుకొను ప్రయత్నము వారి యందధికమగును. వారెల్లప్పుడు వస్తువులను ముట్టుకొనుచు వాటి విషయము తల్లిదండ్రుల ననేక ప్రశ్నల నడుగుదురు. వారడుగు మొట్టమొదటి ప్రశ్న "ఇది యేమి?" ఈ ప్రశ్న తల్లిదండ్రులకు విసుగు కలిగించును. అయితే అది పిల్లలకు విసుగు కలిగించదు. గృహము నందుండు అనేక వస్తువులను చూపెట్టుచు, "ఇది ఏమి?" అని అడుగుదురు. ఈ సామాన్య ప్రశ్న పదేపదే అడుగబడును. కొందరు తల్లిదండ్రులు ఇట్టి ప్రశ్నలకు విసుగుజెంది, వారి తొందరను తప్పించుకొనుటకు వారిని ఆటవస్తువులతో నాడుకొనుటకో. సమీపమందలి పొరుగువారి పిల్లలతో ఆడుకొనుటకో పంపగోరుదురు; అయితే అంతటితో వారి ఆశ్చర్యము అంతముకాదు. కొంత సమయము మాత్రమే వారు తమ ప్రశ్నలను మఱచిపోయి ఆడుకొన మొదలిడుదురు; అయితే అవకాశము కలిగినప్పుడు తిరిగి వారదే ప్రశ్నల నడుగ ప్రారంభించెదరు. తమచుట్టునున్న ప్రపంచమును గుఱించి తెలిసికొన గోరుదురు కాబట్టి వారి అన్వేషణకు వాయిదా వేయజాలరు. వారు తమ జ్ఞానము కొఱకైన ఆకలిని ఆశ్చర్యమును తృప్తిపరచుకొనవలసియున్నది.

వారు ఎదుగుచు ఇతర విషయములతోపాటు వారు బాగుగ విషయముల గ్రహించుకొనుటద్వారా వారు పనులయందభిరుచి గలవారుగ నుందురు. ఆ తరువాత వారీలాటి మరొక ప్రశ్ననడుగుదురు, "నీవు ఏమిచేయుచున్నావు?" తమ తల్లిదండ్రులును, సహోదర సహోదరీలును రోడ్డుప్రక్కన పలురకముల పలువిధములైన పనులుచేయు ప్రజలను చూచునప్పుడు, అక్కడేమి జరుగుచున్నదో తెలిసికొనగోరుదురు. అదంతయును పిల్లలకు చాల చిత్రముగాను సమస్యగాను, అద్భుతముగాను కనబడును కాబట్టి వారీలాటి ప్రశ్నను వేయుదురు. "నీవు యేమి చేయుచున్నావు? లేక ఈ మనుష్యు డేమి చేయుచున్నాడు?" తిరిగి యిక్కడ ఒక పని విషయము తెలిసికొనుటకు బిడ్డ ప్రయత్నించుచున్నది.

తమ చుట్టునున్న ప్రపంచమును అర్థముచేసికొనుటలో వారు తరువాత చేయు ప్రయత్నములో వారు తరువాత అడుగు ప్రశ్న "ఎట్లు." వారు వస్తుజాలమును చూచెదరు. మఱియు వారు ప్రజలు వస్తువులతో పని చేయుచుండుటను చూచుచు వారీవిధమున ప్రశ్నించెదరు, "ఇది యేలాగు

పనిచేయును ? లేదా ఇది యేలాగున జరుగును ?" ఉదాహరణముగ ఒక బిడ్డ తల్లి సమీపమందుండి ఆమె వంట ఇంటిలో పనిచేయుచుండుటను చూచి వచ్చును, అతడు వంటయింటిలో నిప్పును, ఇతర వస్తువులను చూచును. మరియు అతడు తల్లి ఆ వస్తువులతో పనిచేయుటనుకూడ చూచును, అయితే ఆ బిడ్డ ఇప్పుడు వాటి విషయము ఎక్కువ తెలిసికొనగోరి, అతడు సంగతులు యెట్లు జరుగుచున్నవని యెక్కువ ప్రశ్నలు వేయును.

బిడ్డ "ఎట్లు" అని అడుగు అంతస్థు నుండి మరొక అంతస్థుకు వెళ్ళుచున్నది. అనేక విషయములు జరుగుటకు కారణము తెలిసికొన గోరును. నిప్పు ఎందుకు మండుచున్నది ? వర్షము ఎందుకు పడుచున్నది ? నీళ్ళు ఎందుకు ప్రవహించును ? ధూళి ఎందుకు ప్రవహించదు ? అను విషయములను తెలిసికొనుటకు బిడ్డ కోరుచున్నది ? ఈ దశలో కొన్ని ప్రశ్నలు నిజముగ తల్లిదండ్రులకు కష్టతరమును, విసుగును, కలిగించునవియైయుండును. నిప్పు ఎందుకు మండునది, నీళ్ళు ఎందుకు పారునది, తల్లిదండ్రులనేకులు చెప్పజాలరు, అవి యేదో ఒక విధమున సంభవించుచున్నవని మాత్రమే వారికి తెలియును. వారి జీవిత కాలమంతటిలో అవి ఆలాగున సంభవించుట చూచియుందురు. అయితే వారు దానికి కారణములు చెప్పజాలరు.

పట్టుదలలో అడుగబడు "ఎందుకు" అన్నిసమయములలో తీవ్రముగా తీసుకొనబడగూడదు. వారడుగు విషయములను గురించి తల్లిదండ్రు లున్నంత తీవ్రముగా పిల్ల లెప్పుడు నుండరు. వారంతకువారే కనుగొన్న కారణములను తిరిగి బలపర్చుకును, నిర్ధారణచేయుటకును కొన్నిసమయము లందు పిల్లలు తల్లిదండ్రుల సహాయము కోరుదురు. తల్లిదండ్రులు జ్ఞాపకముంచుకొనవలసిన ఒక బంగారు సూత్రమిది. వారు ఈ ప్రశ్నను విని అసహ్యించు కొనగూడదనియు, నిరుత్సాహ పరచకూడదనియు తల్లి దండ్రులు జ్ఞాపకముంచుకొనవలసిన ఒక బంగారు సూత్రము. పిల్లలు మరింత పరిశీలించుటకును, కనిపెట్టుటకును అనువగు జవాబులను వారు అందించవలెను.

శీఘ్రకాలములోనే పిల్లలు "దీని నెవరు సృష్టించిరి ? దాని నెవరు సృష్టించిరి ? నన్ను యెవరు సృష్టించిరి ? దేవుని యెవరు సృష్టించిరి ?

కొంత వఱకు తల్లిదండ్రులు అట్టి ప్రశ్నలకును, అలాంటి తదితర ప్రశ్నలకును జవాబులు చెప్పవచ్చును. అయితే పిల్లలు ఒకటి రెండు ప్రశ్నలతో వారి విచారణ అంత్యము చేయరు. వారు అడుగుచునే యుందురు. వారు " ఎందుకు ? " " ఎట్లు ? " అని ఏ ప్రశ్నకుగాని కలుపుచుందురు. అందువల్ల తల్లిదండ్రులకు అది కష్టమైనపనిగా పరిణమించును. అన్ని ప్రశ్నలకు వారికి జవాబులు తెలియవు. కాబట్టి పిల్లలకు జవాబు లిచ్చుటకు వారికి కష్టతరముగ కనబడును.

కొన్ని సమయములందు పిల్లల ఆశ్చర్యమును తృప్తి పఱచుటకు ఏదేని సమాధానమిచ్చుటకు ప్రయత్నము చేయబడుచున్నది. తాత్కాలికముగ ఇది తోడ్పడవచ్చును, అయితే వారి ప్రశ్నలకు ఇది అంత్యము చేయలేదు. తఱచు తప్పు జవాబులు పిల్లలను తప్పు మార్గమునకు నడిపించును. బిడ్డ తానెట్లు జన్మించినది లేక తానీ ప్రపంచములోని కెట్లు వచ్చినది అడుగును. కొందఱు తల్లిదండ్రులు బిడ్డతో యీలాగున చెప్పుదురు. "పొరుగువారు నిన్ను తీసుకొని వచ్చిరి." లేక "ఇంటిమూల మేము నిన్ను కనుగొంటిమి." లేక "దారి ప్రక్కన." ఈలాటివి మఱికొన్ని జవాబులు చెప్పెదరు. ఇట్టి జవాబులు పిల్లవానిని కొంతమట్టుకే తృప్తిపఱచ వచ్చును. అయితే అతడు తన సహవాసుల నుండి పిల్లలు యెట్లు జన్మించునది తెలిసికొనునప్పుడు అదే ప్రశ్న తిరిగి బాధించును. ఈ పరిస్థితి పిల్లవానికి కొంతకాల మొక సమస్యగా నేర్పడి, అతనికి అంత్యములేని బాధను కలిగించును. కాబట్టి తల్లిదండ్రు నమ్మదగినవారుగ నుండి కేవలము ఊహగాలేకుండా అనుసరింపదగినదిగా నుండునట్లు చెప్పుటకు ప్రయత్నించవలెను. పిల్లలు ఎదుగుచు బాగుగ గ్రహించుకొనగలవారగు కొలది మఱికొన్ని సంగతులను తెలుపుచు రావలెను. ఆలాగున ఇట్టి ప్రశ్నకు సంపూర్ణ జవాబు చెప్పగల కాలము వచ్చును.

జాతి విషయమైన (స్త్రీ. పురుష) ప్రశ్నలు ఎల్లప్పుడు కష్టతరముగ విసుగు కలిగించునదిగ నుండుటవలన జవాబు లిచ్చుటకు నిస్సందేహముగ తల్లిదండ్రులకు కష్టముగనుండును. అట్టి సందర్భములందు బాగుగ తెలిసిన వారి నుండి సహాయము తీసికొనుట మంచిది. సంఘకాపరి నుండిగాని.

సంఘములోనుండు అనుభవశాలులనుండిగాని ఇట్టి సహాయము పొందవచ్చును ఈ అంశముపైన కావలసిన పత్రికలు గలవు. అట్టి వాటిని ముఖ్యముగ విద్యావంతులైన తల్లిదండ్రులు చదువుకొనవలసిన అగత్యమున్నది.

అయితే పిల్లలు ప్రశ్నలడుగవలసినదే, ఈ మార్గమున మాత్రమే వారు సంగతులను తెలిసికొనగలరు. కాబట్టి పెద్దలతో సంభాషించునప్పుడు వారి సంభాషణ ఎక్కువ ప్రశ్నలతో కూడినదై యుండును. చిన్నపిల్లల విషయములో ఇట్లు జరుగుట వాస్తవము. ప్రశ్నలడుగుట నేర్చుకొనుటలో యెక్కువ ప్రాముఖ్యత కలిగియున్నది కాబట్టి తల్లిదండ్రులు కడుజాగ్రత్తగా నుండవలెను, పిల్లలు చెప్పు సంగతుల విషయములో తల్లిదండ్రులు అలక్ష్యము చూపకూడదు. ఒక ప్రశ్నవల్ల వారి బిడ్డ తన మనస్సునందేమి అనుకొనుచున్నదని గ్రహించుకొనుటకు ప్రయత్నించవలెను. బిడ్డ యొక్క మాటల జాబితా సంకుచితమైనది గనుక ఆ బిడ్డ చెప్పకోరినది చెప్పజాలక పోవచ్చును. బిడ్డ యొక్క వివరణాశక్తి సంకుచితమైనది. కాబట్టి తల్లిదండ్రులు ఎక్కువ జాగ్రత్తగ నుండవలసి యున్నది. బిడ్డ అడుగు ప్రశ్నలు ఉద్దేశములేనివికావు, బిడ్డ బడిలో ప్రవేశించక పూర్వము 14,930 మాటలు ఉపయోగించినట్లు తెలియవచ్చినది. అందులో 397 అర్థముతో కూడిన ప్రశ్నలు, 1,967 వాక్యములు, 5 అర్థహీనమైన ప్రశ్నలు, 39 నిమిషముల మౌనత్వముండినట్లు తెలియుచున్నది.

కొన్ని సమయములందు పిల్లలు అసంబంధమైన పరిస్థితులలో ప్రశ్న లడుగుదురు. అట్టివాటి విషయము తల్లిదండ్రు లెక్కువ తొందరపడ నవసరములేదు. ఎందుకనగా పిల్లలందరును ఈలాటి ప్రశ్నలడుగుట సహజము. తల్లిదండ్రులైన వారందరును ఈలాటి కష్టసమయముల తెలిసినవారుగనున్నారు. అట్టితరుణములలో యెవరుగాని లేనిసమయములో వాటిని గురించి వారితో ముచ్చటించెదమనియు లేక అలాగే జరుగుననియు, లేక అట్టి విషయములను అందరియెదుట మాట్లాడకూడదనియు తల్లిదండ్రులైనవారు వారికి చెప్పవలెను. సామాన్యముగా అట్టి జవాబు బిడ్డను తృప్తిపరచును. సాధారణ జవాబు చిన్నబిడ్డకు యెక్కువగా సహాయపడును.

తల్లిదండ్రుల ప్రవర్తన విషయములో పిల్లలు ప్రశ్నలు వేయు కాలము వచ్చును. కొన్ని సమయములందు దానిని చర్చించెదరు. అట్టి సమయములో బిడ్డను తన పనిని తాను చూచుకొనుమనిగాని, మౌనముగా పడియుండుమనిగాని చెప్పుటచాలదు. ఇది తాత్కాలికముగ ఈ సమస్యను పరిష్కరింప వచ్చును. అయితే కుటుంబమందు మఱింత క్రమశిక్షణ సమస్య నది కలిగించును. అట్టి సమయములందు తల్లిదండ్రులు తమ విషయము ఎక్కువ విశ్వాసము కలిగియుండి తమంతట తామే తీర్మానించు కొనుటకు ప్రయత్నించవలెను. వాస్తవముగ తప్పులో నుండిన తల్లి దండ్రులు తమ్మును తామే చక్కపెట్టుకొనుటకు ప్రయత్నించవలెను. ఇట్లు చేయుట బిడ్డకు ఇంకేదిగాని చేయలేని సహాయము చేసినట్లగును. అర్థనీయ మైన మాదిరి శ్రేష్ఠమైన జవాబు.

పిల్లలు 15, 16 సంవత్సరముల వయస్సుగల వారైనప్పుడు వారు తమంతట తాముండుటకు ప్రారంభించెదరు. వారు తల్లిదండ్రుల పనులలో జోక్యము కలిగించుకొనుటకును, తమ బ్రతుకులో తల్లిదండ్రులు జోక్యము కలిగించుకొనకుండుటకును, ఆశించెదరు. వారు స్నేహితులను కలిగి యుండి, తమ తల్లిదండ్రులకు తెలియపఱచుకొనుదానికంటె, వారికి తమ రహస్య సంగతులను తెలుపుకొందురు, వారి సమస్యలను వారి స్నేహితుల తోనే చర్చించుకొందురు. ఈ దశ తొలగించుకొనబడినదికాదు. అయితే తల్లిదండ్రులు వారు స్నేహితులను యేర్పఱచుకొనుటయందు తమ పిల్లలకు సహాయము చేయగలిగి, వారు కూడను వారిని స్నేహించవలెను. ఆలాగు చేయుటవల్ల పిల్లలు ఎచ్చరికముగ నుండక సహవాస స్వభావమును వృద్ధి చేసికొందురు. ఈ సందర్భములో తల్లి తన కుమార్తెకు స్నేహితురాలుగను తండ్రి తన కుమారునికి స్నేహితుడగను నుండగలరు. ఒక కుటుంబము లోని కుమారుడు తన తండ్రి భుజము యెత్తు పెరుగునప్పటికి అతడు పెద్దవానివలె చూడబడి గౌరవింపబడవలెనను సామెత మనకున్నది. తల్లి కుమార్తె సంబంధములో కూడ అదే సత్యము అన్వయించును. ఆలాగైన ద్వివిధ విషయమగుచున్నది. పిల్లలు ప్రశ్నల నడిగిన తల్లిదండ్రులు వాటికి జవాబు లిచ్చుటకు బదులు, వారి లాభము కొఱకును, సంతోషము కొఱకును వారు నొకరి నొకరు మందలించుకొందురు.